కరువురోజుల్లో కాంతమ్మ ఇంట్లో

బ్రహ్మరాక్షసి

రాజబంది

మాటలదొంగ

విదూషకుడు.

# కరువురోజుల్లో కాంతమ్మ ఇంట్లో

## శర్మ — జానకి

జానకి—ఏమండోయ్. మిమ్మల్నే. రారేం ఇంకా?

శర్మ—ఆఁ, వచ్చాను, పెట్టేవి నాలుగూ తొందర పెట్టు. వెళ్ళి చదువుకోవాలె.

జానకి—పెట్టడానికి ఇవ్వాళ ఏమీ చేయలేదు. కాఫీ మాత్రం తాగి వెళ్ళండి. ఇల్లారండి. ఈపీటమీదకూర్చోండి. ఇందండి కాఫీ. బాగుందా?

శర్మ—కాఫీ బాగుందా అని అడుగుతున్నావా? దివ్యంగా ఉంది. దేవతలు నిత్యమూ సేవించే అమృతంలాగ ఉన్నది అన్నా అనవచ్చు, లేక మన పూర్వులుఅయిన ఆర్య ఋషులు తాగే సోమరసంలాగ ఉన్నదీ అన్నా సత్యదూరంకాదు. నీవుకూడా తాగు ప్రేయసీ.

జానకి—ప్రేయసీ లేదు. పిడుగు లేదు. ఛీ ఎట్లా తాగుతారండి.

శర్మ—ఏం?

జానకి—పంచదార లేకపోయె.

శర్మ—కాస్త వెయ్యలేక పోయినావా?

జానకి—(దీర్ఘాలు తీస్తూ) వెయ్యలేకపోయినావా? అబ్బ! ఎట్లా అంటారండి! ఇంట్లో ఉంటేనా వెయ్యటానికి.

శర్మ—పోనీ బెల్లం వెయ్యలేకపోయినావా ?

జానకి—ఛీ బెల్లపు కాఫీ నా కసలు డోకు. కాస్త తీపితక్కువ అయినా పంచదార వేసుకోవలసిందే.

శర్మ—ఇంకేం సురి. తీసి కాస్తనక్కువైతే మటుకేం. ఇదే సంతోషంతో తాగుదాం జానకీ, ఏమంటావు ?

జానకి—ఏమిటి అనేది. తాగండి ఎట్లా తాగుతారో! ఆప్యాయంగా, ఎంతో రుచిగా ఉన్నట్లు. ఛీ వెధవ కాఫీ చేదు.

శర్మ—చేదు కాదు జానకీ. అది చేదు కాదు. అదొక విధమైన రుచి. ఆ రుచికి గనక మనం అలవాటు పడ్డామా ఇక వదలము. అసలు పంచదార కావాలని కోరము కూడాను.

జానకి—బాగుంది. (నవ్వి) పైగా అదో రుచికూడా నా. ఎట్లా కల్పిస్తారండి. నేను తాగలేను బాబూ ఈ కాఫీ. పంచదార లేకుండా.

శర్మ—జానకీ ఏం చేస్తాం. గడ్డురోజులు వచ్చినయి. ఉన్నదాంతో సరిపెట్టుకోవాలె. తీపి కాస్త తక్కువయినా అందులో ఉండే కొత్తరుచిని గ్రహించటం తెలుసుకోవలె నని చెప్పాను కానూ?

జానకి—మీరు గ్రహించండి. మీరు తాగండి ఆ కాఫీ. అబ్బ. ఎట్లా తాగుతున్నారో.

శర్మ— నేను తాగగలను చూశావా జానకీ.

నా ప్రక్కన నీవుంటే
నీ ప్రక్కన నేనుంటే
నా ప్రక్కన నీవుంటే
నాకు కాఫీలోకి తీపక్కర్లేదు సఖీ.
అక్కర్లేదు సఖీ.
తీపక్కర్లేదు సఖీ.

జానకి—బాగానే ఉంది. మీ కవిత్వమూ మీరూనూ. అన్నట్లు మరచిపోయాను. పండగొస్తున్న దండోయ్.

శర్మ—వస్తున్నది.

జానకి—ఎల్లుండేనండి పండగ.

శర్మ—అవును. ఎల్లుండే.

జానకి—ఎట్లా మాట్లాడుతారో తోణక్కుండా పండగవస్తుంటే ఇంట్లో నాలుగూ ఉన్నయ్యేమో చూచుకో వద్దూ!

శర్మ—తప్పకుండా చూచుకోవాలె. నాలుగు ఎందుకుండవూ!

జానకి—బియ్యం లేవు.

శర్మ—బియ్యం ఎందుకు లేవు ?

జానకి—ఎన్నాళ్ళొస్తాయి వెధవ రేషను బియ్యం. అయినా కరువులో అధికమాసం అన్నట్లు ఎవరినో ఒకస్నేహితుణ్ణి తీసుకొ స్తిరి.

శర్మ—తీసుకొ స్తే ?

జానకి—ఆయన తినిపోయినాడు.

శర్మ—ఉఁహూ. (చప్పరించి) అట్లా వచ్చినయి రోజులు ఏం జేస్తాము.

జానకి—ఎట్లాగండి. పంగడపూట కూడానూ.

శర్మ—ఉన్న బియ్యం పండక్కు ఉంచి. ఇవ్వాళా రేపూ గోధుమ రొట్టెలు చెయ్యి.

జానకి—గోధుమలు మటుకు ఉన్నయ్యా ?

శర్మ—అవీ లేవూ? అయితే చూడూ... రే పేవారం?

జానకి—శనివారం.

శర్మ—ఇంకేం. రేపు శనివారం ఉందాము. ఎల్లుండి ఆదివారానికి కరకర ఆకలీ అవుతుంది. బియ్యం ఎట్లాగాఅన్న సమస్యా తీరిపోతుంది.

జానకి—పిల్లదానికి ?

శర్మ—దానికి మటుకు గిద్దెడు బియ్యం వండిపెట్టు.

జానకి—ఏం దరిద్రం వచ్చిందండీ. కాకపోయినా. మనకే వచ్చినట్లుంది ఈ దరిద్రం అంతా.

శర్మ—మనకు ఒకళ్ళకే కాదే. లోకాని కంతకూ వచ్చింది.

జానకి—లోకాని కంతకూ రావాలసింది దే. ప్రతివాళ్ళ ఇంట్లోనూ బస్తాల కొద్దీని బియ్యం ! వీసెలకు వీసెలు పంచదారా ఉన్నయి.

శర్మ—ఎక్కడ తెస్తున్నారో కనుక్కోకపోయినావూ?

జానకి.—కనుక్కోవాలే ఏమిది. చీకటి బజారులో కొనుక్కొంటున్నారు. మీరు కూడా అక్కడే కొనుక్కొంటే ఏ ఇబ్బందీ ఉండదు.

శర్మ—ఎక్కడుందో ఆ బజారు.

జానకి—ఏమో నాకేం తెలుస్తుంది.

శర్మ—నేను వెతికానే జానకీ ఊరంతా వెతికాను. కుండల బజారు, కూరల బజారు, బట్టల బజారు, గడ్డి బజారు ఇవన్నీ కనపడ్డయి కాని ఎక్కడా ఆ చీకటి బజారు కనిపించ లేదు. . వెతికి వెతికి చచ్చాను. ఎవ్వరిని అడిగినా చెప్పలేదు. ఏం జేసేది?

జానకి—మీకు ఏదీ కనబడదు. అది నా ఖర్మం.

శర్మ—అల్లా అనబోకు. నాకు దివ్య సుందరమూర్తివి. నీవు కనపడుతున్నావు.

జానకి—నేను కనబడుతున్నాను. అదీ కొంతనయమే. ఎట్లా ఉన్నానో చూశారా ?

శర్మ—ఓ రంభ లాగ ఉన్నావు.

జానకి—రంభలాగా ? ఏమిది కవిత్వ ఏమి కవిత్వ మండీ. రంభ ఇట్లాగే ఉంటుంది కాబోలు చినిగిన బట్టలు కట్టుకొని.

శర్మ—చినిగిన బట్ట గట్టినా నీవు రంభలాగ ఉన్నావు. రంభేమిటి? (ఒక్క గుక్కలో) రతీదేవి, రాగిణి, రాజరాజే శ్వరి, కలభాషిణి, కాంతం, కనకమ్మ, కన్యాకుమారి, తిలోత్తమ

తిరపతమ్మ, మోహిని, మధురవాణి, శుచిముఖి, శుభ్రాంగి, సునీత, ప్రభావతి, రుక్మిణి, సత్య, కలకంఠి, కనకాంగి......

జానకి—చాల్లెండి. ఆపండి ఆపండి.

శర్మ—(ఆయాసంగా) అల్లా గున్నావు

ఓ చేడియ నీ చీర చెరగులు
నా కళ్ళకు కనుపించవు
కనుపించవు నా కళ్ళకు—సఖి
నా కళ్ళకు కనిపించవు సఖి
కనుపించవు సఖి.

---

శర్మ, జానకీ, సుశీ.

జానకి—అబ్బ. ఇది నిద్ర బోకొచ్చిందే. ఎట్లా దీంతో నిద్రపోవే నా తల్లీ చంపక జోలపాట పాడనా?

(నాలకతో శబ్దము చేసి) హాయి.
హాయి హాయి హాయి ఆపదలు గాయి.
చిన్ని వాండ్రను గాయి శ్రీ వెంకటేశ

అబ్బ, ఎట్లాగే తల్లీ నీతో. నిద్రపోవాయె.

శర్మ—ఏమిటే. ఎందుకు ఏడుస్తుంది చంటిది?

జానకి—నా బొంద చస్తున్నా దీంతో. ఒకటే ఏడ్పు ఆయె. బ్రతిమిలాడినా భయపెట్టినా నిద్రపోదాయె. ఎట్లా గండి?

శర్మ—(కుక్కలాగ అరుస్తాడు) భౌవ్ భౌవ్ భౌవ్. అమ్మో కుక్క లరుస్తున్నాయేవ్ తల్లీ. పెద్దకుక్క. అమ్మో కరుస్తుందమ్మో నిద్రపో.

జానకి—(నవ్వి) పెద్ద కుక్కా ఏమిటండీ ?

శర్మ—చాలా పెద్ద కుక్క.

జానకి (విరగబడి నవ్వి) చూశావుటే తల్లీ ఎంత పెద్ద కుక్క అరుస్తున్నదో. (నవ్వి) ఇక నిద్రపో అమ్మా.

శర్మ—పిల్లి కూడా వచ్చిందే. మ్యావ్ మ్యావ్. అమ్మో పెద్ద పిల్లి. చూడమ్మా.

జానకి—ఎందు కొచ్చావే పిల్లీ.

శర్మ—(కీచుగొంతుకతో) అమ్మాయిని కరుస్తా. అమ్మాయిని కరుస్తా.

జానకి—(నవ్వి) పిల్లి కరుస్తుందటే. తల్లి నిద్రపో... అహా. ఎందుకు నిద్రపోతుంది. అల్లాగ ఏడుస్తూనే ఉంటుంది తెల్లవార్లూ. ఎట్లా చచ్చేది ?

శర్మ—అసలు ఎందు కేడుస్తున్నదో కనుక్కున్నావా?

జానకి—దానికి నోరు ఉందా ఏమిటి చెప్పటానికి.

శర్మ—పోని నీకుందిగా. ఎందు కేడుస్తున్నదో చెప్ప రాదూ.

జానకి—పాలు చాలలేదు.

శర్మ—పాలు చాలకపోతే మరి ఏం జెయ్యాలే ?

జానకి—ఏంజెయ్యాలె. డబ్బాపాలు తెచ్చిపోయాలె. అవి దొరకకపోయె.

శర్మ—డబ్బా పాలు దొరకనిమాట నిజమే. మరి...

జానకి—ఏమిటండీ మీరు అనటం ?

శర్మ—నేను నీతో ఏమీ అనటంలేదు. నాలో నేను అనుకొంటున్నాను.

జానకి—అనుకోండి. ఒక్క తీరాన పిల్ల ఏడుస్తుంటే.

శర్మ—పాల డబ్బాలు దొరకటంలేదు. పిల్లలు ఏడుస్తున్నారు. ఈ విషయం వెంటనే ప్రభుత్వం వారికి తెలియజేస్తాను.

జానకి—ప్రభుత్వంవారు ఏం జేస్తారండి ?

శర్మ—ప్రభుత్వంవారే చెయ్యలేకపోతే సామాన్య గృహస్థుణ్ణి అరవై రూపాయల జీతగాణ్ణి నేనేం చేయగలనని.

జానకి—బాగానే ఉంది. మీ మాటలు.

శర్మ—బాగుండడంసరేగాని. దాన్ని కాస్త ఊరుకో బెట్టే ఉపాయం చూడు.

జానకి—ఇంకా ఉపాయం ఏముంది. అదిగో ఆవు పాలు కుంపటిమీద పెట్టాను. ఆగిన్నె ఇల్లా తీసుకురండి,

శర్మ—ఆ పని ఇందాకే చెయ్యలేకపోయినావా ?

జానకి—పాలవాడు వేళకు వస్తేనా? వచ్చి నీళ్ళు పోస్తున్నాడండీ. ఏం కర్మము ఇది.

శర్మ—నీళ్ళపాలు అయితే పిల్లకు జబ్బుచెయ్యవు. అదీ నయమే.

జానకి—బాగాఉంది. మీరనేమాటలు. అసలు ఏమిటండీ ఈ ఖర్మం. ఏ వస్తువా దొరకటం లేదు. ఆ పాలు కూడా దొరకటం కష్టం అవుతూంటే.

శర్మ—ఏంజేస్తాం జానకీ. అల్లాంటిరోజులు వచ్చినయి ఎట్లాగో కొన్నాళ్ళు గడుపుకోంటే...

జానకి—గడుపుకోంటే ???

శర్మ—మళ్ళీ అన్నీ చౌక అయిపోతయి పుష్కలంగా దొరకనూ దొరుకుతై.

జానకి—అమ్మాయీ, తల్లీ ఈ పాలు తాగుతల్లీ. నిద్రపో. ఇంకా కొన్నిరోజులకు కావలసినన్ని పాలు దొరుకుతవటలే అమ్మా. ఇవ్వాళకు నిద్రపో.

(నాలికతో శబ్దముచేసి) హాయి.

ఆడితే ముద్దమ్మ పాడితే ముద్దు.

అందరికి అమ్మాయి అల్లారుముద్దు హాయి.

—(o)—

జానకి — శర్మ

జానకి—పండుగ రేపేనండి.

శర్మ—ఊఁ.

జానకి—రేపేనండి పండగా.

శర్మ—అ రే!

జానకి—నేను అన్నమాట మీ చెవిన బడుతున్నదా?

శర్మ—పడుతున్నది, పండుగ రేపు.

జానకి—మనం పండగ జేసుకోవాలా ?

శర్మ—చేసుకోవాలా ?

జానకి—చేసుకో వద్దంటుండీ ?

శర్మ—సరే. చేసుకొందాం.

జాన—వాళ్ళ సుందరమ్మ జరీఅంచుచీర కొన్నది. వాళ్ళ ఆయన మద్రాసునుంచి తెచ్చాడట.

శర్మ—ఊఁ.

జానకి—పార్వతమ్మకూడా ఖద్దరుసిల్కుచీర కొనుక్కున్నది.

శర్మ—అరే చాలా తమాషాగా ఉందే!

జానకి—వాళ్ళ రామలక్ష్మి మరి ఎక్కడసంపాదించిందో ఏమో ఉప్పాడ జరీచీర కొనుక్కున్నది.

శర్మ—(దీర్ఘంగా) ఉఁహూ. (ముక్కు)

జానకి—మరిమీరాశారా అంతాకొనుక్కుంటున్నారు.

శర్మ—అవును కొనుక్కుంటున్నారు.

జానకి—మరి ఏమంటారు ?

శర్మ—నాకెందుకూ, నేనుఏమీ అనను. నేను అట్లా ఒకరిని అనేమనిషినికాదు. ఎవరే చీరకొనుక్కుంటే నాకెందుకూ ?

జానకి—అదిగాదండీ—మీకు అన్నీ...విప్పిజెప్పాలె ఖర్మం. నాకు చీర కొనరా ?

శర్మ—చీరకొనాలా ? పోనీ, ఈతభాకు కొనకపోతే నేం ? బట్టలు దొరకటంలేదు. దొరికినా చాలాప్రియంగా ఉన్నాయి.

జానకి—ఉంటే మటుకు.

శర్మ—ఈ పండగకు మా నేద్దామని.

జానకి—మా నేస్తే అందరిలో నాకు చిన్నతనంగా ఉంటుంది. అంతా కొనుక్కుంటూ ఉంటే నేను ఇట్లాగే ఉండేదా ?

శర్మ—ఇట్లా ఉండొద్దులే. కాని ఈ ఖరీదులలో చీర కొనలేనని తోస్తుంది.

జానకి—అవును. మీ కట్లాగే తోస్తుంది. రేపు మా అమ్మ వచ్చి, పండక్కి నీ మొగుడు ఏం చీర కొన్నాడే అంటే ఏం చెప్పా లేమిటి ? (గునుస్తూ)

శర్మ—కావలిస్తే ఆ ప్రశ్న మీ అమ్మ అడిగితే, ఏం చెప్పాలా అన్న ఆ విషయం అలోచించి నీవు ఏమి చెప్పాలి సింది అంతా వ్రాసి ఇస్తాను.

జానకి—నా బొంద ఎవరికి కావాలె మీ కవిత్వం.

శర్మ—మరేం కావాలె.

జానకి—చీర కావాలె.

శర్మ—(తనలో) చీరలు చాలా ఖరీదుగా ఉన్నాయి. చీర కొంటానికి ఇరవయిరూపాయిలన్నా కావాలె. డబ్బు ఎట్లా వస్తుంది ? ఎట్లా వస్తుందో అని ప్రశ్న ? చీర కొనడమా ? మానటమా అది ప్రశ్న ? ?

జానకి—నా బొంద ఏమిటా గొణుగుడు చీర కొంటానికి ఇంత ఆలోచిస్తున్నారు. నా ఖర్మం కాకపోతే ఏమి

టిది. నేను చేసుకొన్న పాపం కాబోలు. పూజకొద్దీ పురుషులు అన్నారు. నేను చేసుకొన్న పూజ అల్లాంటిది. (ఏడ్పు గొంతుక) నా ఖర్మం. కొంతమంది సరదాలు ఇట్లు ఇట్టే తీరుతయ్. నోట్లో మాట నోట్లో ఉండంగానే కావలసిన వస్తువులు వచ్చిపడతై.

శర్మ—ఎట్లా వస్తయ్యో.

జానకి—ఏమో. సూరమ్మ పోయినసారి మొగిడితో ఊరికే బెంగుళూరు సిల్కు చీరలు బాగుంటయ్యి అని అన్నదట. అమ్మో. ఆ మర్నాటి కల్లా బెంగుళూరు సిల్కు చీర కొనుక్కొచ్చి ఇచ్చాడు మొగుడు.

శర్మ—ఓరి వీడిని తగలెయ్య.

జానకి—పద్మావతి సంగతి వింటే మీరు ఇంకా ఆశ్చర్యపోతారు. మొగుడూ పెళ్ళామూనూ...

శర్మ—ఏ మొగుడూ పెళ్ళాం ?

జానకి—అదేనండీ. చెప్పటం లేదూ. పద్మావతీ, పద్మావతి మొగుడున్నూ సినిమాకు వెడుతున్నారు.

శర్మ—(ఆశ్చర్యంగా) ఆః. సినిమాకే ! చాలా ఆశ్చర్యం కాదూ ?

జానకి—అందులో ఆశ్చర్యమేముందీ. మీ రెడంతా...

శర్మ—నీవు అన్నావుగా. ఆశ్చర్య పోతావు అని అందుకనే.

జానకి—చాల్లెండి. అదికాదు సినిమాకు పోతుంటే, ఎవరో ఒక ఆమె కోయంబత్తూరు చీర గట్టుకొని అట్లా పోతున్నదట.

శర్మ—ఆఁ. (ఆశ్చర్యముతో) అరే.

జానకి—పోతుంటే పద్మావతి చూచి ఆ చీర బాగుంది అన్నదట. అంతే. సినిమా చూచి ఆడవాళ్ళ గేటులోనుంచి బైట కొచ్చేసరికి, ఈయన అప్పుడే చీర పట్టుకొనుంచున్నాడు. ఎప్పుడు వెళ్ళాడో, ఎప్పుడు తెచ్చాడో మరి.

శర్మ—వీడిని పాతెయ్య. ఊఁ. ఎంత తమాషాచేశాడు.

జానకి—మీ ఎక్కిరింపుల కేం లెండి ?

శర్మ—వెక్కిరించటం గాదు. నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది.

జానకి—పెళ్ళాం నాట అంటే అట్లా గౌరవిస్తారు అందరూను. మీ రేమో నోరు తెరుచుకొని అడిగినా మాట్లాడ రాయె.

సుశీ—అమ్మా అమ్మా అమ్మా

జానకి—ఏమిటే తల్లి.

సుశీ—వాళ్ళ జయే మంచి పరికిణీ కుట్టించుకొందే.

జానకి—వింటున్నారా ?

శర్మ—వింటున్నాను.

సుశీ—అమ్మా మణి కూడనే వాళ్ళ అమ్మ నడిగి పూల పరికిణీ కుట్టించు కొంటుందటే.

జానకి—విన్నారా ?

శర్మ—విన్నాను.

సుశీ—మరే. రాధమ్మకూడా, వాళ్ళనాన్న—పట్టు పరికిణీ, పట్టు జాకెట్టూ, చటుకుప్పెలూ అవన్నీ కొనిస్తాట్టే అమ్మా.

జానకి—వినపడుతున్నయ్యా దాని మాటలు ?

శర్మ—వినపడుతున్నయి.

సుశీ—మరి నాకో ?

జానకి—మీ నాన్న అడుగో అడుగు.

సుశీ—నాన్నా నా కొనియ్యవూ ? నాన్నా కొనియ్యవూ ?

శర్మ—... ...

సుశీ—నాన్నా నాకు కూడా కొనియ్యవూ ?

జానకి—ఏమండోయ్. వినపడటంలేదూ ?

శర్మ—(ఉలిక్కిపడి) ఓ వినపడుతున్నయి.

సుశీ—కొత్తపరికిణి కొత్తజాకెట్టు...

శర్మ—కొనిస్తాలే తల్లీ.

సుశీ—సాయంత్రానికి కావాలె.

శర్మ—సాయంత్రానికే ?

సుశీ—రేపేగా పండుగ, తెస్తావా? ఏంనాన్నా కొని తెస్తావా నాన్నా ? నాన్నా కొని తెస్తావా ? నాన్నా ?

జానకి—ఏమండోయి మళ్ళీనా. వినపడటంలేదూ?

శర్మ—చక్కగా వినిపిస్తున్నది. తెస్తానమ్మా.

సుశీ—తప్పకుండా ?

శర్మ—తప్పకుండా తెస్తా.

సుశీ—బట్టే తేకపోతే—

శర్మ—(రుద్ధ కంఠము) నా తల్లి తెస్తానమ్మా, ఎట్లాగో కష్టపడి అప్పులు చేసి తెస్తానమ్మా.

జానకి—తెస్తారా నిజంగా ?

శర్మ—తప్పకుండా తెస్తాను, ఎంతకష్టపడి అయినా సరే, ఎంత త్యాగం చేసి తప్పకుండా పిల్లదానికి కొత్తబట్టలు కొనిచ్చి దాన్ని సంతోషపెడతాను. అది మనస్సు చిన్నబుచ్చుకుంటే చూడలేను...చూడూ. ఎవరో పిలుస్తున్నట్లున్నారూ.

---

శర్మ, గుమాస్తా, జానకీ

గుమాస్తా—శర్మగారు ఉన్నారండీ అమ్మగారూ?

జానకి—ఎవరయ్యా.

గుమా—నేను షాహుకారు గుమాస్తానండీ అమ్మగారూ.

జాన—ఆఁ, అయితే ?

గుమా—శర్మగారు ఉన్నారా అని అడుగుతున్నానండీ ?

శర్మ—పీడికుంప తెగవచ్చాడూ, లేరని చెప్పు (విష్పర్)

జాన—(పెద్దగా) లేరయ్యా.

గుమా—ఎక్కడికెళ్లారండి అమ్మా?

శర్మ—బైటకి వెళ్ళారని చెప్పు (విష్పర్)

జాన—ఏమో ఎక్కడికో వెళ్లారు. అయినా ఎందుకూ?

శర్మ—అడగబోకే, ఆమాట అడగబోకు. ఆషావుకారుకు డబ్బు ఇయ్యాల నేను (విష్పర్)

గుమా—మా షావుకారుకు డబ్బు ఇయ్యాలనండి. పాతబాకీ బాపతు వసూలు చేసుకొని రమ్మని పంపారు.

జాన—పాతబాకీ, పాతబాకీ. ఎప్పుడూ పాతబాకే.

గుమా—పోయిన దసరాకు బట్టలుకొన్నారండి. నెలాఖరుకు ఇస్తానన్నారు. ఇయ్యలేదు.

జాన—ఇస్తారులే వెళ్ళు.

గుమా—అల్లా కాదండి. అమ్మా. ఇవ్వాళ వసూలు చేసుకొని రమ్మన్నారు.

శర్మ—ఇంట్లో లేరని చెప్పు. (విష్పర్)

జాన—ఇంట్లో లేరయ్యా మరి.

గుమా—పోనీ మళ్ళీవస్తానులెండి. అమ్మా ఎప్పుడు వస్తారు?

జాన—పదిగంటలకు.

శర్మ—అయ్యో, అయ్యో, పదిగంటలకని చెప్పకు మళ్ళీవస్తాడు. వీడిదుంపతెగ గొంతుమీద కూర్చుంటాడు (విష్పర్)

గుమా—పదిగంటలకు మళ్ళీవస్తాను. అడిగి పుచ్చుకోండి, అమ్మగారూ.

శర్మ—పదిగంటలకు రారని చెప్పు (విష్పర్)

జాన—వస్తే అట్లాగేలే.

గుమా—సందేహంగా అంటున్నారు రారా ఏమిటండీ ?

శర్మ—రారని చెప్పు (విష్పర్)

జాన—రారని చెబితే నమ్మవద్దూ. (పైకి) ఏమోనయ్యా నమ్మకం లేదూ.

గుమా—పండగపూట ఎక్కడికెడతారండి ఇంటికి రాకుండా ?

శర్మ—చచ్చాం. (విష్పర్)

జాన—బజారుకెళ్ళి అక్కడినుంచి ఏదో ఊరు వెళ్ళతానన్నారయ్యా.

గుమా—ఎప్పుడొస్తారండీ ఊరినుంచి.

శర్మ—రారు. అసలే రారని చెప్పు (విష్పర్)

జాన—చాల్లే ఊరుకోండి (విష్పర్) ఏమోనయ్యా ఎప్పుడొస్తారో చెప్పలేదు.

గుమా—సరేలెండి. వచ్చింతరవాత చెప్పండి. షావుకారు గుమాస్తా వచ్చి వెళ్ళాడు పాతబాకీ తీర్చకపోతే మర్యాదగా ఉండదని చెప్పండి.

జానకి—సరేలే.

శర్మ—చూశావా. ఇట్లా ఉంది మన స్థితి. ఏం జేస్తాం. ప్రతి వస్తువ ధరలు పెరిగిపోయినవి. వచ్చే ఆదాయమేమో చాలదాయె. ఖర్మం. ఆ సాహుకారు ఉన్న వీధిని మనకు నిషేధం. ఇంకో వీధిని నడవాలె.

జానకి—మనకే వచ్చింది ఈ అవస్థ.

శర్మ—అవునులె మనకే. భాగ్యవంతులకు ఏ బాధ లేదు. వాళ్ళకు కావలసినంత డబ్బు ఉంది. ఎంత ఖరీదు అయినాసరే డబ్బు పారేసి కొనుక్కుంటారు.

జానకి—బీదవాళ్ళపని బాగానే ఉంది.

శర్మ—ఏమి ఉండదూ. ఆ కుటుంబాలలో ఉన్న నలుగురూ సంపాదిస్తారు. మన మోస్తరు కుటుంబాలలో ఒక్కడే నాయె సంపాదన. అదీ సంగతి.

---

శర్మ—జానకి

శర్మ—జానకీ. ఓయ్. జానకీ. ఉన్నావా?

జానకి—ఏమిటి?

శర్మ—చూడూ! ఈ ప్రపంచం అంతా కూడా అట్టిదే సుమా.

జానకి—ఏం?

శర్మ—ఈ విశాల ప్రపంచంలో ఒక్కడికీ కూడా జ్ఞానం లేకపోవటము చాలా విచిత్రంగా ఉంది.

జానకి—ఒక్కడికీ జ్ఞానం లేదూ.

శర్మ—ఒక్కడికీ. ఒక్కడికైనా. కాస్త దయా దాక్షిణ్యాలు లేవుగదా.

జానకి—అంతేనండి. ప్రపంచమే అల్లా ఉంది ఏమిటి సంగతి ?

శర్మ—చెబుతున్నాగా. ఇంతమంది స్నేహితులు. బంధువులు ఉన్నారు. ఒక్కడికైనా కాస్త తెలితేటలు లేకపోవటం ఏమిటీ అంటా ?

జానకి— ఏమిటండీ అసలుసంగతి ?

శర్మ—ఏముంది ? తల నేలనేసి కొట్టుకోందామా అని అనిపిస్తున్నది.

జానకి—అయ్యో శర్మమా. సంగతేమిటో చెప్ప రాదూ. ఏమిటండీ శర్మం ? ఏమొచ్చింది ?

శర్మ—అజ్ఞానులు, అవివేకులని.

జానకి—బాగానే ఉందివ్యవహారం. సంగతి చెప్పరేం?

శర్మ—ఒక్కడూ. ఇయ్యండే. శేషాచారిని అడిగాను కాస్త డబ్బు ఉన్నవాడు కదా అని. వాడి భార్య కడుపుతో ఉందట.

జానకి—ఉంటే ?

శర్మ—ఎప్పుడేమి అవసరం వస్తుందో, చేతిలో ఉన్న డబ్బు ఖర్చు చేయకూడదు అన్నాడు.

జానకి—నిజమే మరి.

శర్మ—వాడి తలకాయ. అయితే మటుకు స్నేహితుణ్ణి కదా. ఒక పాతిక రూపాయలు అప్పు ఇస్తే వీడి సొమ్ము అంతా అయిపోయినట్లు దిగులుముఖం పెట్టాడు. వెధవ. తన భార్య కడుపుతో ఉందా.

జానకి—మరి ఆయన భార్య కనే నెల లేమో

శర్మ—కనే నెలలు. ఏమిటో వెధవసాకు. అయినా మన కర్మం కాకపోతే ఆ అమ్మాయి సరిగ్గా ఈ పండగకే కంటానని కూర్చోటం ఏమిటి ?

జానకి—మరీ బాగుందండోయ్. ఇంతకూ ఏం జేశారు?

శర్మ—ఏదో చేశాను. ఇదిగో. ఈ పరికిణీ చొక్కా అమ్మాయి కియ్యి. నీకూ ఇదిగో చీర...

జానకి—ఈ చీరా. పండగ బహుమానం ఇది. అయ్యో. అయ్యో. నలభై య్యో నెంబరు ముతకచీర. చాల్లె ఊరుకోండి.

శర్మ—జానకీ. చీరలో ఏమీ లేదు. చూస్తున్నావుగా. అవస్థలు. ప్రేమతో తెచ్చాను. కట్టుకో. నన్ను సంతోషపెట్టు ఏడ్పించక. దీనికి తోడు ఓ గేయము కూడా—నీకు పండగ కానుకగా ఇస్తున్నాను.

జానకి—రవిక గుడ్డా...?

శర్మ—రవిక గుడ్డ కాదే. పద్యం లాంటిది. విను.

ఏ చీర గట్టితే నేమీ
మా కాంత

ఏ రవిక తొడిగితే నేమీ
వెన్నపూసా మనసు, కన్నతల్లీ ప్రేమ
ముత్యాలు వర్షించే ముద్దుల్ల మోము
పచ్చని మోము నా, కస్తూరి బొట్లూ
ఏ చీర గట్టితే నేమీ
మా కాంత
ఏ రవిక తొడిగితే నేమీ.

---

జానకి, సుందరమ్మ, సీతమ్మ—పదేళ్ళపిల్ల

సుం—ఏం జానికమ్మ ఒదినా ఏం జేస్తున్నావూ ?

జా—రా సుందరమ్మ వొదినా రావమ్మా కూర్చుం దాము. అదిగో సీతకూడా వస్తున్నదే. రావేసీతా.

సీత—ఏం అత్తా, తీరిగ్గా కూర్చున్నావు. భోజనాలు అయిపోయినైగా.

జాన—అయిపోయినయమ్మా. మీ మావయ్య భోం చేసి పడుకొన్నారు. నే నిట్లా నడుం వాల్చాను.

సుం—ఏం జేశావు వదినా పండగ పిండివంటలు ? ఆ సంగతి చెబుదూ.

సీత—మాయింట్లోనే గారెలూ, ఆవడలూ చేశారు అత్తయ్యా.

జాన—మీయింట్లో ఏంజేశారు వదినా ?

సుం—బొబ్బట్లు చేశాను వదినా.

సీత—మైదాపిండి ఎక్కడ దొరికింది అత్తయ్యా?

జాన—మైదాపిండిమాట అట్లాఉంచు సెనగపప్పు కావద్దూ? అదెట్లా సంపాదించారమ్మా?

సు—మీ అన్నయ్య ఎట్లాగో సంపాదించారు వదినా. ఆయనకు చాలామంది తెలిసినవాళ్ళు ఉన్నారులే. అంతా పంచదార లేదనీ, మైదాపిండి లేదనీ, బియ్యం లేవనీ నానా అవస్థా పడుతున్నారా, మాకు ఆఇబ్బందిలేదమ్మోయ్. మీ అన్నయ్య అన్నీ తెచ్చిపడేస్తారు. ఎట్లా తెస్తారో మరి.

సీత—ఆయనకు అంతా తెలుసు అత్తయ్యా.

సుం—మీ యింట్లో ఏం చేసుకొన్నారో చెప్పలేదమ్మా వదినా.

జాన—మా అన్నయ్యకు అంతపలుకుబడి ఉంటే మాకేం తక్కువ. అన్నయ్య ఇప్పించాలో ఏమో మరి అన్నీ తెచ్చి పడేశాగన్నా మీ అన్నయ్యకూడా.

సుం—ఎట్లా, ఎట్లా, అయితే ఏమేమి చేశావు చెప్పవూ?

జాన—ఏముందీ, మా ఇంట్లోనూ బొబ్బట్లుచేశాను. ఎన్నో చెయ్యలేదు. వదినా. పిల్లలకు మాకు సరిపోయేలాగున చేశాను. అంతే. కాస్త మినప్పప్పు నానబోసి నాలుగు గారెలుచేశాను. సగే పులిహోర ఎట్లాగూ తప్పదుకదా. ఇక ఎటొచ్చి పిల్లది నాలుగుతింటుందని కాసిని చక్కిరాలు చేశాను, అంతేనమ్మా.

సీత—అబ్బో, ఎన్ని చేశావు అత్తయ్యా.

జాన—ఏం లాభం, అమ్మా, పండగపూట నాలుగూ చేసుకొన్నది తింటానికేనా...

సుం—మరి ఎందుకు ?

జాన—అవునా, మీ అన్నయ్యా ఏం జేశారనుకొన్నావ్ వదినా, ఇద్దరు స్నేహితులను లాక్కొచ్చారమ్మా. పనివేళా, దాంతో ఒక్కముక్క అయినా మిగులలేదు.

సుం—పోనిలే వదినా బాగా నేజరిపావు పండగ.

జాన—ఏమిటోనమ్మా కొందరే ఏదో ఒకటి చేసుకొని పండగ పండగని చంకలుకొట్టుకొంటారు నాకు నాలుగు పిండివంటలన్నా చేయంది ఏమిటో చదమ్మోయ్. చెప్పొద్దూ, ఇంకేమన్నా చేసేనా అంటే ఆయనే వద్దన్నారు. పోనిలే, ఈ పండగకు ఇల్లాగ పోనిద్దామని ఊరుకొన్నాను. ఈతఫా మైసూరుపాకం. రసగుల్లాలు, చమ్యాలె. దేముడు దయఉంటె మైసూరుబజ్జీలూ, హల్వా, అరిసెలు... చెయ్యాలని ఉంది.

సీత. సుం—ఎంత అదృష్టవంతురాలవు వదినా.

సీత—మాఅమ్మనుకూడా అడుగుతా అవన్నీ చేయమని.

జాన—ఎందుకూ సీతా, ఈతఫా పండగకు నీవు మాయింటికి భోజనానికి వద్దువుగాని.

సీత—సరే వస్తాను అత్తయ్యా.

సుం—నేను మటుకూ, నేనూ వస్తాను.

జాన—రా వదినా, తప్పకుండా రా, వస్తే పెట్టలేక పోతామా.

సుం—అది సరేగాని కొత్తచీర కొనుక్కున్నావా ఈపండగకు.

జాన—నువ్వో ?

సుం—ఏమోనమ్మా బట్టలుదొరకటంలేదు. దొరికినా మండిపోతున్నయ్. ఎక్కడకొంటాం వదినా? అందుకని నేనే వద్దన్నాను. కొత్తచీర ఒకటి పెట్టెలోఉందిలే. దాంతో గడిపేస్తాను.

జాన—నిజమే వదినా బట్టలు మరీమండిపోతున్నాయి—కాకపోయినా, నేనూ అల్లాగే అన్నాను మా అన్నయ్యతో. అంటే ఆయన వినక ఏదో ఒకచీర కొద్దిఖరీదుగలది తెచ్చారు. పండగరోజున నేను కొత్తచీర కట్టుకోకపోతే ఆయనకు పిచ్చిగా ఉంటుందట.

సుం—మా ఆయనకూ పూర్వం అల్లాగే పిచ్చిపిచ్చిగా ఉండేదటగాని, ధరలు మరీ పెరిగిపొయ్యేసరికి. ఇప్పుడు అంతపిచ్చిగా ఉండటంలేదుట.

జాన—(నవ్వి) బాగాఅన్నావువదినా. ధరలు ఇట్లాగే ఉంటే అన్నిపిచ్చులూ కుదురుతయ్.

సుం—కాని ఎల్లకాలం ఇల్లాగే ఉంటయ్యా ఈమండి పోయిన ధరలు.

జానకి—ఎందు కుంటాయిలే.

సుం—ధరలు తగ్గగానే, నాలుగు మంచి చీరలు కొనుక్కోవాలె వదినా. పెద్దాపురం సిల్కు చీరలు నాలు గూనూ, కోయంబత్తూరు చీరలు ఓ నాలుగూనూ.

జానకి—నేను అదే చూస్తున్నా. సంవత్సరాదికైనా తగ్గితే బాగుండును వదినా.

సుం—ఈ సంగతి విన్నావా వదినా. మంచిదే సమ యానికే జ్ఞాపకం వచ్చింది. రేపు జనవరి ౨౬ తారీఖున మన దేశం స్వతంత్ర దేశం అవుతుందట. ఆ రోజున ఎన్నో మంచిమంచి పనులు చేస్తారట. అంతా అనుకొంటున్నారు. వదినా.

జానకి—ఏం మంచి పనులు వదినా ?

సుం—అదే చెప్పొస్తున్నా. నీవు మాటకు అడ్డం వచ్చావు—ఏమిటీ అంటే చాలా కాలనుంచి జైలులో ఉన్న వాళ్ళను వదిలేస్తారట. గవర్నమెంటు ఉద్యోగస్థులకు నాలుగు నెలల జీతం ఊరికే ఇస్తారట. మరి ఆడవాళ్ళకోసం ఒక గంట టమ్మా—సరిగ్గా ఒక గంటసేపు—మధ్యాహ్నం బట్టలు అంటే చీరలూ రెవిక గుడ్డలూ, అవీ, నవగసులూ చౌకగా అమ్ము స్తారట వదినా.

జానకి—(సంతోషంతో) ఎవరూ ?

సుం—ప్రతి ఊళ్ళోనూ కలెక్టరు దగ్గర ఉండి అమ్మి స్తాడట.

జానకి—తమాషే వదినా డబ్బు ఉండి కొనుక్కుంటే బాగుండును. ఇప్పటినుంచీ కాస్త కాస్త వెనకెయ్యి. నేను వేస్తాను. ఇద్దరం కొనుకొందాం. ప్రొద్దుగూక వచ్చిందమ్మోయ్.—వెడతాను వదినా— రావే సీతా వెడతాము.

......

శర్మ—జానకీ చాలా బాగుంది. నీ మాటలు అన్నీ వింటున్నాను. అద్భుతంగా ఉంది నీ నటన. పండగ బాగా గడిచిపోయింది. అట్లా ఉండాలె నేర్పు.

జానకి—(నవ్వి) మరి ఏం జేస్తామండీ. నలుగురిలోనూ చిన్నతనం పడతామా ?

శర్మ—రైట్ అసలు జీవితమే అల్లాగ వెళ్ళబుచ్చాలె. రైట్.

# బ్రహ్మరాక్షసి

## ఒకటవ రంగం

[స్థలం:-మంగళగిరి, గుంటూరు మధ్య రోడ్డుమీద సత్రం. రాత్రి పది గంటలు. సుబ్బిశెట్టి, రత్తయ్య మాట్లాడు కుంటూ ఉంటారు. హాలులో:-హాలులో చాలాభాగం చీకటి ఒకమూల ఆముదం దీపం. కాలం:-యాభైయేండ్ల క్రితం.]

సుబ్బిశెట్టి—దర్గాంమీద బట్ట నూస్తుండంగానే తగలడిపోయిందంట నిజమేనా ?

రత్తయ్య—నిజంగానయ్యా. అబద్ధం చెప్పిందాకా వాళ్ళ కేం కర్మంఅంటా ?

సుబ్బిశెట్టి—ఏమోలే, మనం నూళ్ళేదు గదా. మన కళ్ళకు కనబడేది కాదాయె !

రత్తయ్య—మన కళ్ళకు కనపడకపోతే మటుకు ఉండ వంటావా ?

సుబ్బిశెట్టి—ఏమో !

రత్తయ్య—ఆమాటకొస్తే మన కళ్ళకు కనపడనివి ఎన్ని లేవు !!

సుబ్బిశెట్టి—ఏమున్నాయి అంటావ్ ?

రత్తయ్య—ఏమున్నయ్ అంటావా. అనేకం ఉన్నాయి

సుబ్బిశెట్టి—ఏమున్నవి చెబుతూ ?

రత్తయ్య—చెప్పటానికేం ? గాలి మన కళ్ళకు కన పడుతుందా చెపుదూ ఎక్కడిదాకానో పోతావు ?

సుబ్బిశెట్టి—అయితే కొన్ని దయ్యాలు కళ్ళకు కన పడతై అంటారు. అదేంది ?

రత్తయ్య—కొన్ని కనబడతై సుబ్బిశెట్టీ. మా నాన్న ఒకసారి దయ్యంతో మాట్లాడుతూ నడిచాడు.

సుబ్బిశెట్టి—ఎట్లాగయ్యా ! ఏం జరిగిందేంటి ?

రత్తయ్య—మా నాన్న ఒకసారి పలనాడు వెళ్ళి వస్తున్నాడయ్యా !

సత్తెనపల్లిలో భోజనం చేసి గుంటూరు వస్తున్నాడు. దారిలో చీకటి పడ్డది. రోడ్డుకు రెండువైపులా రావి చెట్లూ మర్రిచెట్లూ బ్రహ్మాండంగా పెరిగిఉన్నయి. కొంచెంమబ్బుపట్టింది. చీకటి భయంకరంగా ఉంది. మా నాన్నకు భయం వేసింది. అప్పుడేం చేస్తాడు ! గుంటూరు ఇంకా నాలుగైదుమైళ్ళ దూరంలో ఉంది. తోడు ఎవ్వరు లేరు.

సుబ్బిశెట్టి—ఒక్కొక్కప్పుడు అట్లాగే అవుతుం దయ్యా !

రత్తయ్య—అప్పుడేమైంది అనుకొన్నావు. ఎవరైనా కాస్త తోడు ఉంటే బాగుండురా భగవంతుడా ! అని అను కొన్నాట్ట మా నాన్న. ఇంతలో ముందు పది బారల దూరంలో ఒక మనిషి కనబడ్డాట్ట.

మా నాన్నకు భయంవేసి ఎవరు వారు అని కేక వేశాడు. ఆ ముందువెళ్ళే మనిషి ఆగాడు ఈయన వచ్చిందాకా. ఏ వూరయ్యా మీది అని అడిగాడు మా నాన్న. ఆ మనిషి ఏదో ఊరు పేరు చెప్పి తానూ గుంటూరు వస్తున్నానని చెప్పాడు.

సుబ్బిశెట్టి—ఆమనిషే దయ్యంఅంటావా ?

రత్తయ్య—వినవయ్యా మరి. ఇద్దరూ పిచ్చాపాటి మాట్లాడుకొంటూ నడిచారయ్యా.

ఆ మనిషి మా నాన్నతో అన్నాడట. ఈ ప్రాంతాల దయ్యా లున్నయ్యండి. చీకటి పడ్డ తరువాత ఒంటరిగా నడవ కూడదు అని.

మనం ఒకరికొకరం తోడుగా ఉన్నాంగదా. మరేం భయం లేదులే అని మా నాన్న ధైర్యం చెప్పాడట.

ఇద్దరూ కలిసి నడుస్తున్నారయ్యా. ఊరి దగ్గరకు వచ్చారు. దూరాన ఎవరో గడ్డిమోపులు మోసుకొని పోతు న్నారు.

బ్రతికామయ్యా ఇక మనకు భయం లేదు అన్నాడు మా నాన్న.

ఆ మనిషి 'నిజమేలే ఇక నీవు పో' అన్నాడట.

ఇదేమిటబ్బా, ఇట్లా అంటాడు; తనుకూడా గుంటూరే వస్తానన్నాడుగా అని అనుకొని మా నాన్న ఇటు చూసేసరికి ఆ మనిషి లేడయ్యా! మాయమైనాడు!

సుబ్బిశెట్టి—దయ్యమైనా కాస్త మంచోడు. ఏమం టావు రత్తయ్యా ?

రత్తయ్య—అదేనయ్యా నేను చెప్పేది ?

సుబ్బిశెట్టి—మరి, కొన్ని దయ్యాలు ఏడి పిస్తయ్యట గదయ్యా ?

రత్తయ్య—అవి చిలిపి దయ్యాలు సుబ్బిశెట్టి.

సుబ్బిశెట్టి—అయితే.....దయ్యాలలో కూడా మంచి సెడ్డలున్నాయంటావు.

రత్తయ్య—మనుష్యులలో లేరూ అట్లాగే వాటిలో కూడా.

అందులో కొన్ని లంబాడీ దయ్యాలని ఉంటై సుబ్బి శెట్టీ—అవి పట్టుకొంటే వదలవు.

సుబ్బిశెట్టి—అయితే లంబాడీ దయ్యాలు, బ్రాహ్మణ దయ్యాలు, కోమటి దయ్యాలూ ఇల్లాగ ఉన్నయ్యంటావా ?

రత్తయ్య—ఎందు కుండవయ్యా ?...కాని కోమటి దయ్యాల మాటమాత్రం నేను వినలేదు.

సుబ్బిశెట్టి—బ్రాహ్మణ దయ్యాలూ ?

రత్తయ్య—కావలసి నన్ని...బ్రహ్మరాక్షసు లం టారు వాటిని.

సుబ్బిశెట్టి—అవి మనుష్యులను పీక్కు తింటయ్యగా?

రత్తయ్య—అన్నీ పీక్కు తింటయ్యా! కొన్ని మంచివి ఉంటైయ్.

సుబ్బిశెట్టి—అయితే...మంచివాళ్ళు దయ్యాలెందు కవుతారు ?

రత్తయ్య—ఏదో, పాపంవల్ల కొంతకాలం ఆ రూపంలో ఉంటాయ్యట. నర జన్మలో ఏం బుద్ధులుంటయ్యో దయ్యం అయినా ఆ బుద్ధులే ఉంటయ్.

సుబ్బిశెట్టి—అంతేలే రత్తయ్యా. మనిషి మారితే మనసు మారుతుందా ?

రత్తయ్య—బాగా చెప్పావు !

ప్ర: సత్రపు నౌకరు సోమయ్య

సోమయ్య—ఏమిటి బాబయ్యా ప్రొద్దుపోయిందాకా కూర్చుండరు ?

సుబ్బిశెట్టి—ఏదో ఎఱుగవు లోకాభిరామాయణం మాట్లాడుకొంటున్నాము.

సోమయ్య—ఏటండీ బాబూ ?

రత్తయ్య—ఏదో దయ్యాలసంగతి మాట్లాడుతున్నాము సోమయ్యా.

సోమయ్య—దయ్యాల సంగతా అండి. బాబయ్యా దయ్యాలున్నా యంటారా బాబయ్యా ?

రత్తయ్య—ఎందుకులేవూ ? మనశాస్త్రాలలో ఉన్న సంగతేగా ?

సోమయ్య—మనశాస్త్రాలలో ఉందండి బాబయ్యా, సిత్రమేనండీ; నానూ ఇన్నాను గాని ఎప్పుడూ సూడలేదండీ!

సుబ్బిశెట్టి—నవ్వావ్ విన్నావు సోమయ్యా ?

రత్తయ్య—దయ్యాల సంగతే ?

సోమయ్య—దయ్యాల సంగతి, ఇన్నాను బాబయ్యా

సుబ్బిశెట్టి—ఏమిటి సంగతి. నిజంగా ఉన్నాయం టావా ?

సోమయ్య—ఉన్నయిఅంటారు బాబయ్యా! మనకేం తెలుత్తదండి !

రత్తయ్య—ఎక్కడదాకానో ఎందుకు ఈసత్రంలో ఒక దయ్యం ఉందని చెప్పుకొంటారు. మానాన్న చెప్పాడు.

సుబ్బిశెట్టి—ఈసత్రంలోనా! ఛా అబద్ధం.

రత్తయ్య—మా నాన్న చెప్పాడయ్య నిజమో అబద్ధమో !

సుబ్బిశెట్టి—ఏం దయ్యం ?

రత్తయ్య—బ్రాహ్మణ దయ్యం.

సుబ్బిశెట్టి—బ్రహ్మరాక్షసే?—చచ్చాం. నిజంగానా పరాసికాలాడుతున్నావా రత్తయ్య ?

రత్తయ్య—పరాసికం కాదు. ఈసత్రంలో ఎన్నాళ్ళ నుంచో ఉన్నది.

సుబ్బిశెట్టి—ఎన్నాళ్ళనుంచో ఉంటే సోమయ్యకు తెలియకుండా ఉంటుందా ?— ఏం సోమయ్యా ?

సోమయ్య—ఏటి బాబూ ?

సుబ్బిశెట్టి—ఈ సత్రంలో దయ్యాలున్నయ్యా ?

సోమయ్య—(నవ్వి)-ఈడ దయ్యం యాడిది బాబూ?

రత్తయ్య—అదికాదోయ్. ఈసత్రంలో ఒకదయ్యం ఉందని అంతా అనుకొంటూరా, అనుకోరా చెప్పు?

సోమయ్య—ఎవరు అనుకొంటూరు బాబయ్యా. నాను ఇనలేదండి.

సుబ్బిశెట్టి—నీవు అట్లా అంటూ వేం రత్తయ్యా. నన్ను భయపెడదామనా నీ ఉద్దేశం?

రత్తయ్య—ఛా ఛా నిజంగానయ్యా. ఈసోమయ్యకు సరిగ్గా తెలియదు. సోమయ్యా నీవువచ్చి ఎన్నాళ్లైంది?

సోమయ్య—ఏడాదిపైనే అయింది బాబూ.

రత్తయ్య—అట్లా చెప్పు. అందుకనే నీకు సరిగ్గా తెలియదు. మానాన్న అబద్ధం ఎందుకు చెపుతాడు.

సుబ్బిశెట్టి—ఊఁ అయ్య ఏమిచెప్పేడో చెపుదూ?

రత్తయ్య—ఈ సత్రంలోనో, మరి ఈ ప్రాంతాల్లో నో ఒకబ్రహ్మరాక్షసి ఉందని...అర్ధరాత్రి వేళ ఈప్రాంతాల వేదఘోష వినపడుతూ ఉందనీ, ఆయన చెప్పాడు. ఏమోయ్ సోమయ్యా నీవు ఎప్పుడూ వినలేదూ?

సోమయ్య—నాను ఇనలేదండి - నేను మొద్దునిద్ర పోతానండి.

రత్తయ్య—పోనీ చూడకపోతే మానే- వేద ఘోష వినలేదూ?

సోమయ్య—ఏదగో నేంటండి బాబయ్యా ఎదవ గోసలతో నాకేం పనండి బాబయ్య- నాపని నే సూసుకోం టానండి- ఓరి గోసా నాకు పట్టదు బాబయ్యా!

రత్తయ్య—అదిగాదు సోమయ్యా. బ్రాహ్మలు చదివే మంత్రాలు! అర్ధరాత్రి అప్పుడు అల్లాంటి మంత్రాలు నీ వేన్నైనా విన్నావా?

సోమయ్య—ఇనలేదండి బాబు. నా నెప్పుడూ ఇనలేదు.

సుబ్బిశెట్టి—అసలెందుకొచ్చిన ఘోష. రత్తయ్యా మనం లేచిపోదాం రావయ్య.

సోమయ్య—యాడికిపోతారు బాబయ్య?

సుబ్బిశెట్టి—గుంటూరురోడ్డు ఎక్కుదాం. మెల్లిగా నడిస్తే తెల్లవారేసరికి గుంటూరు పోలేమా?

రత్తయ్య—పోలేకేం?

సోమయ్య—పోవచ్చుచుగాని బాబయ్యా దార్లో దొంగలబయ్యం అండి! దగ్గరున్నవి లాక్కొని వదిలేస్తేనయ మేనండి. బట్టకూడా లాక్కొని గోచీపెట్టి పంపిత్తారుగందా! అదే వచ్చిన కర్మం బాబయ్యా-

సుబ్బిశెట్టి—చచ్చాము రత్తయ్యా. అటెళ్ళితే దొంగలు, ఇక్కడుంటే దయ్యాలు! ఎట్లా సావటం.

రత్తయ్య—అప్పుడే దయ్యంవచ్చి మీదపడ్డట్లేభయ పడతావేం సుబ్బిశెట్టి? ఏదో మాటలు వచ్చినై కాబట్టి కబుర్లు చెప్పుకున్నాం నురేమీ భయములేదులే. పడుకో.

సోమయ్య—ఇన్నాళ్ళబట్టీ నేనుండ లేదండి. దయ్యం ఉంటే నాకంట బడకుండా ఉంటుందా?

మరేం భయంలేదు పడుకోండి.

బాబయ్యా-శివాజ్ఞ లేనిది సీమ అయినాకుట్టదు బాబు

---

## రెండవ రంగము

[ సత్రం బైట వసారా ]

( సోమయ్య — అతని భార్యా పడుకొని ఉన్నారు!. హాలులో నిద్ర పోతున్న వాళ్ళ గురకలు వినపడుతూ ఉంటవి దూరాన కుక్కలు అరుస్తూ ఉంటవి )

లక్ష్మి—ఓయ్. విన్నే...ఏం నిద్ర అది...అదిగో. విన్నేనయ్యా... లెగమంటే...ఏంటయ్యా.

సోమయ్య—(కదిలి-మూల్గి-మళ్ళీ నిద్రపోతాడు)

లక్ష్మి—ఏం నిద్రయ్యా...అంత మొద్దునిద్ర అయితే...ఎట్లాగంట! నీక్కూడా సెపట లెగమంట!

సోమయ్య—(కోపంతో) ఏయ్. ఉండవే బ్రహ్మ రాచ్చసీ. ఊరుకోరాదూ...ఏంటి గోల? నిద్రలో ఉన్నోణ్ణి లెగగొడతా వేందేం?

లక్ష్మి—అయ్యో, ఏంటయ్యా ఆనిద్ర ఇంటున్నావా.

సోమయ్య—ఏంటది?

లక్ష్మి—నీ కినపడటం లేదంటయ్యా? సెవుల్లో సెల్లు మొలిసినయ్యాంట!

సోమయ్య—ఏంటే నీ ఎర్రి కాలిపోను.

లక్ష్మి—ఏందో దొడ్డి వసారాలో మడుసులున్నట్టుం దయ్యా, ఆ చప్పుడేందంట! ఎందో గొణుకుడులాగుంది! ఏంటయ్యా అది!

సోమయ్య—ఆ, కోమటాయన అబ్బాయి మాట్లాడు కొంటున్నారేమో - లెయ్యే!

లక్ష్మి—అర్ధరాత్రప్పుడు ఏం మాటలయ్యా! కాస్త ఎళ్ళి సూసిరావయ్యా!

సోమయ్య—ఇప్పుడేంటి సూసేది. పడుకోయే!

---

## మూడవ రంగము

(సత్రం దొడ్డివైపు వసారాలో ఇద్దరు మనుష్యులు)

దీక్షితులు—యాజులూ శుక్రోదయం అయింది లే.

యాజులు—అయితే దీక్షితులుగారూ ఇప్పుడే బయలుదేరదామా?

దీక్షితులు—బయలుదేరితే బయలుదేరనూ వచ్చు సూర్యోదయం అయ్యేసరికి మనం మంగళగిరి చేరుతాము.

యాజులు—నృసింహస్వామి దర్శనం చేసుకొని ఈ పూట అక్కడ ఉందాం.

దీక్షితులు—అల్లాగా కానీయ్. అయితే బయలు దేరుదామా.

యాజులు—కాలకృత్యాలు తీర్చుకొందాం.

దీక్షితులు—తూర్పు దిశగా వెళ్ళితివా నాలుగైదు ఫర్లాంగుల దూరంలో అనుకూలంగా ఉంటుంది వెళ్ళు. నేను వెళ్ళి వచ్చాను. అక్కడే స్నానానికి అనుకూలంగా ఉంది.

యాజులు—సరే నేను ఇప్పుడే వస్తాను. నీవు ఇక్కడే ఉండు.

దీక్షితులు—అల్లాగే. వేదం వల్లె వేస్తూ ఉంటాను. చప్పున రా.

---

## నాలుగవ రంగం

(మళ్ళీ సత్రంముందుగది. సోమయ్య, భార్య)

లక్ష్మి—ఇదిగో ఒక మాట. లెగవయ్యా అదేంటయ్యా-ఓరో ఏడుస్తున్నట్లుంది.

సోమయ్య—ఏటే. నీదంతా వోసాద!

లక్ష్మి—అదేం గొణుగుడయ్యా. ఓరినో గొంతు నులిమి సంపేత్తున్నట్లుంది! ఆగొణుగు డేందయ్యా ఎప్పుడూ లేదు.

సోమయ్య—ఏంటే. నువాయ గోల పోయి సూడరాదూ?

లక్ష్మి—నాకు భయం కాదటయ్యా.

(హాలులోనుంచి సోమయ్యా! లక్ష్మి! రండి అని కేకలు)

ఆరు పిలుస్తుండారయ్యా.

సోమయ్య—వస్తుండాను బాబయ్యా, రాయె అయ్య గారు పిలుస్తుండారు.

లక్ష్మి—వాస్తుండు. వస్తున్నా ... నీవు ఒక్కడివి ఎళ్ళకు. వస్తుండా నుండు.

---

అయిదవ రంగం

[స్థలం హాలు]

(సోమయ్య, లక్ష్మి, రత్తయ్య, సుబ్బిశెట్టి, అంతా హాలులో కూర్చుంటారు గుసగుసలు)

రత్తయ్య—సోమయ్యా. ఏమిటా శబ్దం ?

సోమయ్య —మడుసులేనా ?

లక్ష్మి—మడుసు లోరు ఉండారయ్యా ఆడ.

సోమయ్య—ఆ గొణుకు డేంది తమాసగుందే!

సుబ్బిశెట్టి—ఎవరో మంత్రాలు చదువు తున్నట్లుందయ్యా.

లక్ష్మి—అదేటి బాబు తమాసగుంది.

రత్తయ్య—వేదం అంటే అదే.

సోమయ్య—ఏదమేనా బాబయ్య!

సుబ్బిశెట్టి—అయితే రత్తయ్యా మనం ఇందాక అను
కొన్నాము!! అదేనంటావా ?

రత్తయ్య—ఇంకా సందేహం ఎందుకు అది వేద
ఘోష తెలియటం లేదూ ?

సోమయ్య—(భయంతో) ఏద గోస తే ఇదేనా
బాబయ్యా !

రత్తయ్య—ఇదేనయ్యా ఖర్మం !

సోమయ్య—అయితే ఆ బ్రహ్మరాచ్చసేమో.

లక్ష్మి—రాచ్చసీ గీచ్చసీ అనబోకమయ్యా. ఆయనకు
కోపం వస్తుంది.

ఎందుకండీ ఆ బ్రాహ్మరాచ్చసి అట్ల గంటుంది ?

రత్తయ్య—అది వేదఘోష అని చెపటం లేదూ నీకు.

సోమయ్య—ఓరి నీయాదగోస బంగారంగాను. ఎప్పుడు
లేదు యీగోస ఇదేంటంట !

సుబ్బిశెట్టి—సోమయ్యా, గొంతు అంతా మనిషి
గొంతు లాగేఉందే !

లక్ష్మి—అచ్చంగా మడిసి గొంతే !

సోమయ్య—అంతే బాబయ్యా అంతా మడిసి గొంతే
నండి !

రత్తయ్య—ఇది బ్రహ్మరాక్షసే ఇంకా సందేహం
ఎందుకు.

సుబ్బిశెట్టి—ఇందాక నీవు చెప్పావుగా ఈ ప్రాంతాల ఒక బ్రహ్మరాక్షసి తిరుగుతూ ఉంటుందని. నీవు అన్నట్లే అదీ రావటం తెమసాగా లేదూ ?

రత్తయ్య—మనకర్మం ఇప్పుడెట్లాగంట ?

సుబ్బిశెట్టి—సోమయ్యా అటు వెళ్ళి కాస్త తొంగి చూడయ్యా. అసలేమిటో తెలుస్తుంది.

రత్తయ్య—ఎందుకయ్యా చూడటం ?

సుబ్బిశెట్టి—అసలు ఏమిటో తెలుస్తుంది దయ్యమో? మనిషో ? మరిఏమిటో !

రత్తయ్య—దయ్యం కాదయ్యా బ్రహ్మరాక్షసి. వేదం చదువుకొన్న బ్రాహ్మడు ఎవరో ఈ రూపం పొందాడు.

సుబ్బిశెట్టి—బ్రహ్మరాక్షసి భయంకరంగా ఉంటుందా?

రత్తయ్య—ఆ ఁ (నవ్వి) అంతా మనిషిలాగే ఉం టుందయ్యా. మనిషికీ దానికి ఏమీ భేదం ఉండదు.

సోమయ్య—గొంతుకూడా మడిసి గొంతేనాయె !

రత్తయ్య—ఒక్క గొంతేమిటయ్యా రూపం మాట అంతా మనిషేననుకో. ఇందాక ఏం చెప్పాను. మా నాన్నతో కలిసి పాయిలా పాయిలాగా మాట్లాడుతు గుంటూరుదాక వచ్చిందని చెప్పలే ఒక దయ్యం.

సోమయ్య—చూస్తే మనిషిలాగే ఉంటాడయ్యా ?

రత్తయ్య—ఆ.

లక్ష్మి—మాట్లాడిస్తే ?

రత్తయ్య—మాట్లాడిస్తే మనలాగే మాట్లాడుతుంది. ఆ బ్రహ్మరాక్షసి మంచిదైతే. లేకపోతే......

సుబ్బిశెట్టి—లేకపోతే ఏంజేస్తుంది రత్తయ్యా?

రత్తయ్య—ఏంజేస్తుందో!

సుబ్బిశెట్టి—సోమయ్యా కాస్త తొంగి చూద్దూ?

సోమయ్య—నాకు భయంకాదు బాబయ్యా?

రత్తయ్య—బ్రాహ్మణ దయ్యాలు ఏంజేయవయ్య.

సోమయ్య—అయితే నీవు చూడరాదూ?

రత్తయ్య—చూస్తానుకాని ఒక పని చెయ్యి. నీవు నా చెయ్యి పట్టుకోని నా పక్కన నిలబడు.

సోమయ్య—మన ఇద్దరిని లాగేత్తే.

లక్ష్మి—ఇదిగో నీకేంమకయ్యా. నువ్వు వూరుకో! ఆయన చెయ్యంటుకోవద్దు. నీ క్కాదూ సెపటం.

సోమయ్య—ఏంటే నీవు వూరుకోయ్! పిరికి మందు పోత్తవు.

సుబ్బిశెట్టి—సోమయ్యా, నీ కేం భయంలేదు. నీవు రత్తయ్య చెయ్యి పట్టుకో నీ చెయ్యి పట్టుకొని నేను గుమ్మం ఇవతల నిలబడుతాను.

రత్తయ్య—ఊఁ, పట్టుకో సోమయ్యా.

లక్ష్మి—ఏమయ్యోయ్, నీవు ఆడుండు. కొంచెం ఈ కడనుంచోవయ్యా. నీకు. కదూ సెప్పేది?

సుబ్బిశెట్టి—చూడు రత్తయ్యా.

లక్ష్మి—నీవు ఇసింట రావయ్యా, మహా మొనగాడివి లాగ తోసుకుపోతాం డావు యాడికో.

రత్తయ్య—నడు సోమయ్యా నడు.

లక్ష్మి—ఉండరా రండయ్యా.

సుబ్బిశెట్టి—వస్తున్నావే ? ఇంతకూ కనపడ్డదా?

సోమయ్య—బమ్మ రాక్షసి !

లక్ష్మి—ఇంకా నయము మే మీదడలేదు.

రత్తయ్య—(భయంతో వణుకుతూ) తెల్లటి దుప్పటి కప్పుకొన్నది.

సోమయ్య—గోడవానుకు కూకున్నదయ్యా ?

రత్తయ్య—కళ్ళు చూశావా సోమయ్యా ఎట్టా మెరిసి పోతున్నయ్యో !

సోమయ్య—చింత నిప్పులాగా ఎఱ్ఱగున్నయి.

సుబ్బిశెట్టి—కాళ్ళు వెనక్కు తిరిగి ఉన్నయ్యా రత్తయ్యా !

రత్తయ్య—నేను చూడలేదయ్యా !

సోమయ్య—నాను సూశాను !

లక్ష్మి—నీ వస్నీ సూత్తవు తెగించినోడివి !

సుబ్బిశెట్టి—కాళ్ళు ఎట్టాగున్నయి సోమయ్యా ?

సోమయ్య—ముడుసు కూర్చుకుండు.

సుబ్బిశెట్టి—అయితే ఇంతకూ మనిషిలాగే ఉందందూ?

సోమయ్య—అచ్చంగా మడిసి కూకున్నట్లే కూకుండు ఏదో గొణుక్కుంటుండు.

సుబ్బిశెట్టి—ఇప్పుడెట్లా ? అన్యాయంగా చచ్చేలాగున్నాము. ఎవరినైనా కేకేస్తే సోమయ్యా ?

సోమయ్య—ఈ అడవిలో వోరున్నారు బాబయ్యా

లక్ష్మి— తెల్లారితే అంతా జనమే !

సుబ్బిశెట్టి—అందాకా బతికి బాగుంటే కదా!- (పెద్దగా కేక పెడతాడు) అమ్మో, అమ్మో, ఆంజనేయస్వామీ రక్షించు స్వామీ !

రత్తయ్య—ఏమిటి సుబ్బిశెట్టి !

సుబ్బిశెట్టి—శ్రీ రామాంజనేయ (దండకం చదువుతాడు)

సోమయ్య—ఏటండీ శెట్టిగారూ, ఏంటి అట్టసూత్తిరు భయంతోచే ప్రాణాలు ఇడిసేటట్లుండరే!

లక్ష్మి—ఏటండీ! గట్లబిత్తర పోయి సూత్తిరు ?

సుబ్బిశెట్టి—పారిపోదాం రావయ్యా రత్తయ్యా ?

లక్ష్మి—పారిపోతే దయ్యాలు వెంటబడ్తై బాబయ్యా సంగతేటండి ?

శెట్టి—నేను కళ్ళార చూచినానయ్యా ! తెల్లటి దుప్పటి కప్పుకొని ఆవసారాలో అటేపునుండి ఇటేపుకు వచ్చాడు. కళ్ళు చింతనిప్పులు! గడ్డంకూడా ఉందయ్యా!

లక్ష్మి—(పెద్దకేక వేసి విరుచుకొని పడిపోతుంది.)

రత్తయ్య—ఏమిటి లక్ష్మి ?

సోమయ్య—ఏందే అట్ల పడిపోయినవు. ఏందే లెగు !

లక్ష్మి—సచ్చినాను బాబు! ఇంకెట్ల? ఆ బమ్మరా చ్చసి అటు కాసినుంచి మళ్ళీ ఇటుకాసి వచ్చింది. నన్ను జూసి కళ్ళురుమింది.

[దొడ్డి వసారాలో బ్రాహ్మణుడు వేదం ఘన - జట వరుసతో చదువుతాడు]

సుబ్బిశెట్టి—ఆ బ్రహ్మరాక్షసి ముండాకొడుకు మన లను అందరిని చంపుతాడేమో !

లక్ష్మి—తిట్టావెందుకయ్యా?

సుబ్బిశెట్టి—దయ్యాలకు ఇనపడ వచ్చిందా ? అంత దూరాన ఉంటే ?

సోమయ్య—వాటికి ఎంత దూరం అయినా ఇనపడు తుందయ్య.

లక్ష్మి—ఏందయ్యా గట్ల గోస పెడుతుంది ఇను ఇను

[వేదం ఘన - జట గబగబా చదువటం వినిపిస్తుంది]

సోమయ్య—సచ్చాం. ఆయన విన్నాడు కోపంవచ్చిం దేమో !

లక్ష్మి—కాకుంటే అంత ఘోస ఎందుకు పెడతడు!

రత్తయ్య—ఆ రాక్షసిని ఎందుకు తిట్టావు సుబ్బిసెట్టీ?

సోమయ్య—ఆ గోస ఇన్నారా! ఇక మన్నందరిని సుట్టబెట్టి సంపేలాగున్నాడు.

[మళ్ళీ పెద్దగా ఘన - జటలో వేదం వినిపిస్తుంది]

ఇంటున్నావా అంతకంతకు రేగిపోతుండది యవ్వారం!

లక్ష్మి—ఇక మన్నుసంపక వారండయ్యా! నేనెళ్ళి ఆ దయ్యంగారి కాళ్ళమీద పడి రక్షించు బాబో అని ఏడుకొంటా.

నీవు కూడా రావయ్యా!

సోమయ్య—వత్తుండా!

రత్తయ్య— లక్ష్మి—తొందర పడకు.

సుబ్బిశెట్టి—ఇంకేమిటి అక్కడికెళ్ళింది అని.

రత్తయ్య—మనంకూడా వెళ్ళి కాళ్ళమీదపడదాంరా.

సుబ్బిశెట్టి—ఎంత దయ్యమైనా బ్రాహ్మన దయ్యం కదా పద.

[స్థలము—సత్రం దొడ్డివైపు వసారా. దీక్షితులు పురుషసూక్తం చదువుతూ ఉంటాడు. సోమయ్య, రత్తయ్య, సుబ్బిశెట్టి, లక్ష్మి అంతా వస్తారు]

లక్ష్మి—బెమ్మరాచ్చసి మారాజా రక్షించు బాబూ! బీదోళ్ళం సత్రపు నౌకర్లం బాబయ్యా! రచ్చించుదొరా

సోమయ్య—మీపాదాల కాడోళ్ళం బాబయ్యా రచ్చించు స్వామీ.

రత్తయ్య—వేదమూర్తులు బ్రాహ్మణోత్తములు శ్రీమద్యజన యాజనాధ్యయనాధ్యాపన దాన ప్రతిగ్రహషట్కర్మ నిరతులు.

సుబ్బిశెట్టి—దండాలు బాబయ్యా !

[నమస్కారాలు స్వీకరించి పురుషసూక్తం చదువుతూ ఉంటారు-వాళ్ళంతా దూరంగా నుంచుని ఉంటారు]

దీక్షితులు—యద్భూతం యచ్చ భవ్యం

సోమయ్య—ఏటండి బాబయ్య ఏటి అంటుంది.

రత్తయ్య—తెలియటం లా సుబ్బిశెట్టి. నేను భూతాన్ని అని చెప్తున్నాడు.

సుబ్బిశెట్టి—చెబుతున్నాడూ? పబ్లిక్ గా చెబుతుంటే మనమేం జేస్తాం !

[దీక్షితులు పురుషసూక్తం ఘన - జటతో చదువు పోతూఉంటే, రత్తయ్య మొదలైనవాళ్ళు తమకు అర్థం అయిన ముక్కలకు వ్యాఖ్యానం చేస్తూంటారు]

దీక్షితులు—ఏతావానస్య మహిమా

సోమయ్య—రాచ్చసి మళ్ళీ ఏటో అంటుంది?

సుబ్బిశెట్టి—విను సోమయ్య-పెద్దగా రానికు మాట ఏదో మహిమ అంటున్నాడు ?

సోమయ్య—మయిమ సూపెడతినంటాడా ? అబ్బో మయిమగల రాచ్చసే బాబూ ! ఏమంటరు ?

దీక్షితులు—పాదోఽస్య విశ్వాభూతాని.

సోమయ్య—మళ్ళీ బూతాన్ని అంటడే బాబూ?

లక్ష్మి—(పెద్దగా) నీవు బూతానివే సామీ-తెలియక రాచ్చసి అన్నాము. రచ్చించు సామీ

రత్తయ్య—లక్ష్మి కాసేపు ఊరుకో చెపుతా.

దీక్షితులు—ఆరణ్యాన్నాగ్నిమాహ్యశ్చ సో

రత్తయ్య—అరణ్యమే బాబూ! అరణ్యమే!

సోమయ్య—అరణ్యం కాక మరేమిటి?

లక్ష్మి—ఇక్కడ సిక్కడ్డాం బాబయ్య!

దీక్షితులు—యే కేచో భయా దతః

సుబ్బిశెట్టి—భయం ఏమిటి సన్నుంటే!

దీక్షితులు—బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్

సోమయ్య—ఈడ బాంబలెవరున్నారు బాబయ్యా?

దీక్షితులు—ఊరూ తదస్య యద్వైశ్యః

సుబ్బిశెట్టి—మొత్త మీద కనిపెట్టాడయ్యా నేని కక్కడో కోమటోణ్ణి ఉన్నానని!

దీక్షితులు—తాని ధర్మాణి ప్రథమాన్యాస్య

రత్తయ్య—ఇంకెందుకయ్యా తేల్చి చెప్పాడు. తెలో ధర్మం—అన్నాడు.

సుబ్బిశెట్టి—పోనీ దానికేం భాగ్యం ఇద్దాము సంతో షించి పోతే!

దీక్షితులు—హ్రీంశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ

లక్ష్మి—నా పేరు సెపుతుండు. నానేంజేసినాను బాబయ్యా! రచ్చించు బాబయ్య?

రత్తయ్య—సుబ్బిశెట్టీ, నాదగ్గర తమలపాకులున్నై మనం ఇద్దరం ఎవరికి తోచింది వారు ఈ తాంబూలంలో పెట్టి ఆయన పాదాల కాడ ఉంచుదాం.

సుబ్బిశెట్టి—ఇంద ఒకరూపాయి ఇస్తున్నాను, నువ్వ పెట్టిరా. ఆయన దగ్గర.

దీక్షితులు—స్వీకరించి (దీవిస్తాడు)

శతమానం భవతి శతాయుః పురుషః శతేంద్రియ
ఆయుష్యే వేంద్రియే ప్రతితిష్ఠతి.
ఓం శాంతిశ్శాంతి శ్శాంతిః

# రాజబంది

ప్రతీహారి—శ్రీ శ్రీ ప్రతాపరుద్ర మహారాజులుం గారు వినోదార్థము వేటకు పోవుచున్నారు. విజయ బిరుద ప్రశస్తి విజయ విభవాశీర్వచనము, మంగళాచరణ రూపముగా చెప్పవలసిన సమయమైనది. మహా మంత్రులు అనుమతి ఇచ్చినారు.

వందిమాగధులు

స్వస్తి సమస్త పంచ మహాశబ్ద మహా మండలేశ్వర
విజయీభవ
దిగ్విజయీభవ

రాజపరమేశ్వర ,,
ఉద్దండ మండలాగ్ర ప్రచండ ,,
నెలపీడుగండ ,,
పెషిణీ హమ్మంతి ,,
ఆంధ్ర కటక వజ్రప్రాకార ,,
త్రిభువనరాయ రాహుత్తరాయ ,,
ధనుర్విద్యా విశారద ,,
విజయ ప్రతీకాతి షణ్ముఖ ,,
వివేక నారాయణ ,,
ఆశ్రితజన కల్పవృక్ష ,,
అన్యఘన శూర రాయ మానమర్దన ,,

విజయీభవ

దిగ్విజయీభవ

అష్ట దిగ్రాయాంచాళ్లు ,,
అహిపట వశె రాయాంచాళ్లు ,,
దండు గండు శౌచ్చుర్గో యాంచాళ్లు ,,
కాటిల దేవ గాను దేవ ,,
కొమర మీసర గండ ,,
హోస మండలీ కాంచాళ్లు ,,
ఇయ్యన్నె రాణి వాస ,,
ముఖతి గతే రాయాంచాళ్లు ,,
బిరుద నియ్యోగి మన్నియ మచ్చణ ,,
డికాతె ఘనాతె కుమారార యాంచాళ్లు ,,

ఆశీర్వచన పనస.

గంటలు, బూరాలు, పెద్దబాకాలు, డప్పులు మొదలైన వాద్యములు వినిపిస్తవి. మహారాజుగారు వేటకు బయలుదేరుతున్నట్లు సూచన.

వంది—శ్రీ విజయాభ్యుదయ విజితాఖిల భూపగణ శ్రీ సమధిగత పంచ మహాశబ్ద, మహామండల వీర, ఏక శిలానగర వీర, మహావీర, పతిహిత చరిత వినయ విభూషణ శ్రీ మన్మహా మండల వీర సమరోద్దండ వీర ప్రతాపరుద్ర మహారాజులం గారికి—జై.

వాద్యములు-వినిపిస్తవి మొదట దగ్గర మెల్లగా దూరాన. రాజు వేటకు వెళ్ళిపోవు నట్లు సూచన.

ప్రతీహారి—ముప్పిడి నాయనింగారికి నమస్కారములు—దయ చేయుడు—

ముప్పిడి—మహామంత్రులు రాలేదా ?

వంది—ధన్యుడు అధిక పుణ్యుండు
ప్రతాపరుద్ర దేవ సామ్రాజ్య
వర్ధన స్థిర వినీతి కరణ కుశలుండు
నాగయ గన్న విభుడు.

జయము

జయము.

ప్రతీహారి—అదిగో మహామంత్రులు వచ్చుచున్నారు.

ముప్పిడి—మహామంత్రులు నాగయ గన్న మంత్రి గారికి నమస్కారములు.

నాగయ—ఓహో ముప్పిడి నాయనింగారా నమస్కారము. కూర్చొనుడు దగ్గరకు రండు రహస్యము (Whisper) ఈ తురకల బాధ మనకెట్లు వదలును? కప్పమునకై వచ్చినారని గదా మనకు తెలిసినది. రెండువారములైనను రాయబారులను పంపరు. కప్ప మిమ్మని యడుగరు. అడుగనిదే మనమేల తొందర పడవలయునని నేనును ఉపేక్షించితిని. వారు మనపై హఠాత్తుగ పడుదురేమో నని నాకు తోచుచున్నది.

ముప్పిడి—(నవ్వి) ఒకవేళ అట్లు జరిగినను మన కొచ్చిన భయమేమియును లేదు మనము మండలాధిపతుల నందరిని తత్క్షణమే ఓరుగల్లుకు రమ్మని వార్తల నంపితిమి. వారు వత్తురు. భయమేమియును లేదు.

నాగయ—ఎవరెవరు బయలు దేరినారు.

ముప్పిడి—మదక్ సీమనుండి అన్న వెంకయనాయుడు, కమ్మనాటినుండి వేపేటి కొమ్మనాయుడు. బయలుదేరినారు. నేడో రేపో ఓరుగల్లు చేరగలరు.

ప్రతీహారి—మహామంత్రులకు జయము ఎఱ్ఱదాచా నాయనింగారు తమదర్శనార్థమై వచ్చినారు.

నాగయ—వెంటనే ప్రవేశపెట్టుము.

ప్రతీ—పంచ పాండ్య దళవిఘాల! కాలచీ కవాట చూర కార!

జయము జయము.

నాగయ—మహాసేనానులకు స్వాగతము.

దాచా—మహామంత్రులు విచారగ్రస్తులై యుండ పనిలేదు పాండ్యుల పొగరణచిన దాచానాయని చేతులలో శక్తియున్నంతవరకు ఓరుగల్లున కెట్టియాపదయు రాదు.

నాగయ—దాచానాయనింగారూ పెద్ద విచార మేమియును లేదుగాని సింగమ నాయకుడును, పితృసమానులు గురుపాదులు. బెండపూడి అన్నయామాత్యులును పట్టణ మున లేకుండుటే నాకు కష్టముగా నున్నది. కంపిలలో మనపై

తిరుగబడిన రామన ధరాయనితో వారింకను పోరుచున్నట్లు వార్తలు వచ్చినవి. కీడెంచి మేలెంచ వలయును. దుర్గ రక్షణకై ఏర్పాట్లు చేయ వలయును.

ముప్పిడి—చిత్తము.

నాగయ—మీరునూ మహాసేనానులు ఎఱ్ఱదాచానాయనింగారును అవసరమైన ఏర్పాట్లుచేసి ఆజ్ఞలను పంపుడు.

దాచా—చిత్తము.

ముప్పిడి—చిత్తము. మహామంత్రులకు జయము కలుగుగాక. సెలవు—

---

## రెండవ రంగం

### ఓరుగల్లు—పఠాన్ శిబిరము

(ఉలూగ్‌ఖాన్ ఖ్వాజాహాజాఖాన్, బీదర్‌మల్లిక్ ఈ ముగ్గురి సంభాషణ)

ఉలూగ్‌ఖాను—ఓరుగల్ రాజా మన్కి హియ్యాల్సిన కప్పంఇచ్చేదాన్కి ఖరారు అయింది. దన్కి తీస్కొని ఢిల్లీకిపోవాలె. పట్నం పటవాలె? మీాకి ఏమిహుద్దేశం చెప్పవాలె సర్దార్.

బీదర్‌మల్లిక్—జహాపనా, నాకీ హోక్టిమాట సెప్తాన్. ఈ కాఫర్ కా రాజా నమ్మక్‌హారామ్. హెన్క మన్మవచ్చినప్డు ఏమిచేశాడ్? ద్రోహంచేశాడ్. ఘియాసుద్దీన్ తోగ్లక్

మర్గయా హైం నాడని పుకార్ పుట్టించాడ్ అదిమాట నిజం హాక్కొని పఠాన్ సైన్యం ఢిల్లీకి వాడ్ తీసింది. ఝూంహాబాత్. సుల్తాన్ హిందువుంసులాగ హక్టఉంటే హాక్ట మన్కి ఫికర్ పుట్టించాడ్. సుల్తానువారికి ఖోపం వచ్చి హేంమి శేషాడ్ తఖ్మీ గెప్తిఉంది లేదూ సర్కార్? పారిపోయివచ్చి సర్దార్ సాహే బుల్క్ భత్కిఉండంగానే గుంటంలో పాతిపెట్టించి పైన ఘోడ కట్టాడ్.

ఉంబాంగ్—అచ్ఛ అచ్ఛ నాకీ గెప్తిఉంది. అయితే నీకీ హేంమీ సెప్తావ్. బీడర్ మల్లిక్ సాహేబ్ మన్కి హిప్పు హేంమి సెయ్యాలె అని మీంది హుద్దేశం?

మల్లి— నాకీ హుద్దేశం సెప్తాను సర్కార్. రాజాహిప్పు పట్నంమే లేడు. అన్నయమంత్రిభి లేడు. ఇది మంచిసమయం. మనం స్నేహంతో ఉన్నామని నాగయమంత్రి హుద్దేశంలో ఉన్నాడ్. రాజాలేనిసమయంమే మనం పట్నం పట్టివేయ్యాలె.

ఉంబాంగ్—అచ్ఛా! సర్దార్ ఖ్వాజా హాజాఖాన్ వార్కి హేంవి హిష్టం?- ఓగ్గల్ పట్టవలె అది మీంకీ హిష్టం?

ఖ్వాజా—పట్నం పట్టేదాన్కి నాకీభి హిష్టం. దాన్కి ముందు రాజాని పట్టవలె. రాజు ఖైది అయిన సంగ్తి తెలిసింది తో పట్నం బేజారు అయిపోతాంది. ఫౌజ్కి హిమ్మత్ ఉండద్. అప్పు పట్నం సులభంగా మనవశం అవుతుంది. అది నాది సలహా!

ఉలూగ్—ఎంతమంచి హాలోచన చేస్తావ్ నీకి

ఖాజాహాజీఖాన్—నీవు సెప్పింది మాకు సమ్మత్—హైతే రాజును హెట్లాగు పట్టవలె. హాదిమాకు కొంచెం సెప్పు సర్దార్.

ఖ్వాజా.—హాది ఏమికష్టం లేదూ సర్కార్. ఒకసర్దార్ కి కొంచం లష్కర్ ఇచ్చి పంపవలె ఆ సర్దార్ (విస్పష్ )- రాజు హెక్కడ ఉన్నడ్ జంగిల్ మే హక్కడ పోవాలె. హెవ్వరిక తెల్వకూడదు. జహూర్ మే పోవవలె, పోయి రాజాని పట్టవలె.

ఉలూగ్—అచ్ఛా ఖ్వాజీహాజాఖాన్ బహుత్ అచ్ఛా హై. రాజానిపట్టి ఏమిసెయ్యాలె?

ఖ్వాజా—ఢిల్లీకి తీస్కపోదాం.

ఉలూగ్—అచ్ఛా అచ్ఛా. హిప్పు అంతా తెల్సింది. మంచి హాలోచనసేశావు ఖాజీ.

హాజాఖాన్—అచ్ఛా వైసాకరేంగే. బీడర్ మల్లిక్ ఖాన్ సర్దార్ - ఖ్వాజాహాజాఖాన్ సర్దార్ మీరు హిద్దరూ జంగిల్ మే పోయి రాజాను పట్టండి.

బీడర్— }<br>
ఖ్వాజా— } జోహుకుం సర్కార్

ఉలూగ్—రాజాను పట్టినసంగ్తి మాకీ కబర్ సెయ్యండి. ఆ సంగ్తి తెల్సిన తచ్చణం మాకీ పట్నం పైపడి, వశం చేస్కుంటాము. అచ్ఛా—మీరు జహూర్ మే పొండి.

బీడర్—
ఖ్వాజీ— } సలాం సర్కార్. మాకి సెల్వ-

ఉలూగ్—అచ్ఛా-రాజాని పట్టినసంగ్తి తెల్సెదా కా, ఓర్గల్ మే నాగయమంత్రికి హువ్వాసం లేకఉండేదాన్కి తియ్యనిమాటల్ వినిపించవలె. కాఫర్ కా రాజాపట్టి ఢిల్లీకి పంపి నాకీ ఓర్గల్ తఖత్ హోంకవలె.

మూడవ రంగం

ప్రతీహారి—నాగయ గన్న మంత్రులకు జయము జయము. అన్ను వెంకట నాయనింగారును, వేపేటి కొమ్మ నాయని గారును తమ దర్శనార్థమై వేచియున్నారు ప్రభూ.

నాగయ—వెంటనే ప్రవేశపెట్టుము.

ప్రతిహారి—అన్ను వెంకటనాయనింగారు. మెదక్ సీమ ప్రభువులు. వేపేటి కొమ్మ నాయనింగారు కమ్మనాటి ప్రభువులు.

నాగయ—మండలాధిపతులకు స్వాగతము రండి కూర్చొనుడు. వెంకటనాయనింగారూ మెదక్ సీను యందలి ప్రజలకు సుఖమే కదా

వెంక—సుఖమే ప్రభూ

నాగయ—కొమ్మనాయనింగారూ కమ్మనాటి నుండి శ్రమయనక సమయమునకు వచ్చుట మాకెంతయు సంతోషముగ నున్నది.

కొమ్మ—ఆపద సమయమున తప్పక రావలయును గదా ప్రభూ.

నాగయ—ఇట్టి ఆపద సమయమున ప్రోలయ వేమా రెడ్డి మనకు సాయము వచ్చుటకు నిరాకరించి ధరణికోట యందు స్వతంత్రుడైనట్లు తెలియవచ్చినది. ఇట్టి రాజద్రోహుల నేమన వలయునో నాకు తెలియకున్నది.

కొమ్మ—ఆంధ్రులలో కూడ రాజద్రోహము పొడ సూపుట...మనదురదృష్టము.

నాగయ—ఇచ్చటి పరిస్థితులు మీకంకను తెలియ వని తలచెదను.

కొమ్మ—
వెంక— } చిత్తము ప్రభూ!

నాగయ—రాజున కేదో అపకారము చేయుదుశ్చింతతో ఉలూగ్ ఖాన్ కొంత సేనను అరణ్య ప్రాంతములకు పంపినట్లును మిగిలిన సైన్యము నగరముపై బడుటకు సమయమునకు నిరీక్షించుచున్నట్లునూ మన వేగుల వలన తెలియ వచ్చినది.

కొమ్మ—చిత్తము ప్రభూ! మా ప్రాణములకు లెక్క సేయక ఆంధ్ర సామ్రాజ్యమును కాపాడుటకు సిద్ధముగ నున్నాము.

ప్రతిహారి—ఆంధ్ర రాజ్యస్థాపక, కాలాగ్నిహోత్ర జయము జయము.

గన్నయ—ఒహో కంపిలను.డి పితృ సమానులు బెండపూడి అన్నయా మాత్యులంగారు వచ్చు చున్నారు. మహామంత్రులకు కుమారుడు నమస్కరించు చున్నాడు.

అన్నయ—శుభం భవతు సమస్త కల్యాణగుణ పరం పరా ప్రాప్తిరస్తు. నాయనా! గన్నయ మంత్రీ! అంతయు వింటిని. మరేమియు భయములేదు. కప్పమిచ్చినను పోక తురుష్కులు ద్రోహము తలపెట్టినారు. అందేమియు సందేహము లేదు. మహారాజు డెబ్బది అయిదేండ్ల ముదుసలిగదా వేటకు పోవుట ఏమి ?.........

గన్న—వారు వేటకై అరణ్యములకు వెళ్ళిన మరు నాడే తురుష్క సేనలు వచ్చినవి.

అన్నయ—రాజు సురక్షితముగా నగరమునకు తిరిగి వచ్చిన. రాజ్యము నిలుచును. సరి సరి ఆ తలపు లేలరావ లయునాకు ! ఈ శత్రుసేనల వెంటనే పారదోల వలయును. దుర్గ రక్షణకై ఏర్పాట్లు చేసితివా నాయనా !

నాగయ—వలసినఏర్పాట్లు ఇదివరకే చేసియున్నాను. అన్నయకన్నమనీడు గారిని సాహిణి మారుని అరణ్యములకు పంపుము రాజును రక్షించుటకు.

నాగయ—అట్లే చేసెదను తండ్రీ.

అన్నయ—నాగయ గన్నమంత్రీ! మరొక విషయము ఉన్నయ ప్రగడయు బ్రహ్మనాయనింగారును శత్రువులపై

కేగి వాని హానుమకొండ నుండి పారదోల వలయునని ఆజ్ఞ ఇమ్ము.

నాగయ—ఇప్పుడే ఆజ్ఞలను పంపెదను. తంత్రీ (రణ భేరీడప్పులు పెద్దబాకాలు మొదలగు వాద్యములు మోత విన వచ్చును—దూరాన)

అన్నయ—ఏమది?

నాగయ—మన సైన్యములు శత్రువులపైకి నడుచు చున్నవి.

[వాద్యములు దూరాన వినవచ్చును
సైన్యములు యుద్ధమునకు
పోవు చున్నట్లు సూచన.]

---

## నాలుగవ రంగం

ఉలూగ్—ముస్తఫాఖాన్

ఉలూగ్—ముస్తఫాఖాన్ సర్దార్ హేమ్మి మీాకి సెప్తారు? ఈతల్కీ, బేడర్ మల్లిక్, ఖ్వాజాహాజీ వాళ్ళు హిద్దరు రాజాకి పట్టిఉంటారని మీాకి తోస్తది లేదూ?

ముస్తఫా—ఖబర్ నై ఆతే సర్కార్ వాళ్ళుహిద్దర్ జంగిల్ మే పోయినార్. హాక్ట మర్గయా హైందీ రాజా మే పట్టింది తెల్సింది లేదు. నాకిభీ ఘుండె దడ్ దడ్ అంటాది.

ఉలూగ్—రాజా మే పడ్తారు నాకీ తోస్తది!

ముస్తఫా—కొంచెం కష్టం హుంది సర్కార్ ఓర్గల్ నుంచి హొక్కి సేన, రాజాకుసాయంసేసేదాన్కి, రాజామన్కి సిక్కకుండా పోయేదాన్కి పోయిఉంది.

ఉలూగ్—అయితో, హిప్పుపోయిన సేనా జంగిల్ మే ఉన్న రాజావారిసేనా, మిలాయిత్ అయిందితో, మనపని కష్టం అవుతాది.

ముస్తఫా—ఫర్వానై సర్కార్. ఓర్గసేన జంగిల్ మే రాజాకి హెత్కటాన్కి మొదల్ మనలష్కర్ ఆరిని హుక్ట నుంచీ, హిక్టనుంచి కన్పడకుండా హూతం సేస్తాఉంది.

ఉలూగ్—అచ్ఛా. నాకీ హొక్టసెప్తా. నీకి ఈతచ్ఛ నంపోయి, బీడర్ మల్లిక్ ఖ్వాజాహాజీ సాహేబులను కల్సి కొని రాజాకిపట్టి ఢిల్లీకి దౌడ్ తీయ్యాలె అనిసెప్పు. ఓర్గల్ సేన మీాకి హెంటపడకుండా నేను ఆపిపెడ్తాన్. తర్వాతమీాకి కల్సేదానికి వస్తాన్. నీకి జరూర్ పోవాలె సర్దార్.

ముస్తఫా—జోహుకుం సర్కార్.

ఉలూగ్—రాజాకి సఫాసేయువద్దు. ఢిల్లీకి తీస్క పొండి—(నొక్కి చెవుతాడు)

ముస్తఫా—జోహుకుం సర్కార్

---

## అయిదవ రంగం

ప్రతీహారి—నాగయ గన్నమంత్రివారికి జయము—అన్నయామాత్యులు వచ్చుచున్నారు. - ఆంధ్ర రాజ్యస్థాపక! కాలాగ్ని హోత్ర!—జయము జయము.

అన్నయ—నాయనా నాగయగన్నమంత్రీ—

నాగయ—చిత్తము ప్రభూ !

అన్నయ—సాహిణిమారుడు మహారాజును కలిసికొన్నట్లు ఏమైన వార్త తెలిసినదా ?

నాగయ—మన సేనానులు మహారాజుకొరకు వెదకుచున్నారు గాని, చక్రవర్తి జాడలు ఇంతవరకు తెలిసినట్లు లేదు ప్రభూ !

ప్రతీహారి—మహామంత్రులకు జయము, జయము.

అన్నయ—వార్తలేమి ?

ప్రతీ—బొమ్మనాయనింగారునూ, అన్నయ్యప్రగడగారును ఇరువైపులనుండి శత్రువులను కమ్మినారు. ఘోరమైన యుద్ధము జరుగుచున్నదట.

నాగయ—మనకే జయము లభించునుతండ్రీ!

అన్నయ—అది మన ఆశయము.

ప్రతీ—మహామంత్రులకు జయము. బొబ్బారెడ్డి రాజద్రోహియై శత్రువుల జేరినాడు ప్రభూ.

నాగయ—ఎట్టి దురాత్మ!

అన్నయ—అయ్యో ! తెలుగువారిలోకూడ దేశద్రోహులు నేటికి పుట్టినారు. ఇంక కాకతిరాజ్యమునకు చెడు దినములు ప్రాప్తమైనవి కాబోలు.

ప్రతీ—మహామంత్రులకు జయము. తురకసైన్యములు చెల్లాచెదరైపోయినవి. కొందరు సేనానులు

నారు. బీడర్ మల్లిక్ ఖ్వాజాహాజీఖాన్ కనుపించుటలేదు. ఉలూగ్ ఖాన్ ప్రాణములరచేత నిడుకొని పారిపోవుచున్నాడు.

అన్నయ—రాజు యువరాజు, ఘియాసుద్దీన్ అనంతరము ఢిల్లీకి ప్రభువగును. ఈ అవమానమును మరచిపోక మరల మనపై దండెత్తును. అయినను భయములేదు. నేను ఈలోపున హిందూరాజులను కూడగట్టగలను (విచారంగా)- ఇంతకూ—మహారాజు క్షేమముగ నున్నట్లు తెలియలేదే!

గంటలు—దేవాలయంలో మంత్రపఠన. శివార్చన జరుగుతున్నది—వినిపిస్తవి.

నాయనా గన్నయమంత్రీ ఏమియది.

నాగయ—తండ్రీ—ప్రతిదేవాలయములోనూ విజయప్రాప్తికై శివాభిషేకము జరుగునట్లు ఆజ్ఞాపించియున్నాను.

అన్నయ—మంచి పనిచేసినావు. నాయనా మనము కూడ ఆ పరమశివునికి నమస్కరింతము.

వందే శంభుముమాపతిం సురగురుం మొ॥

---

ఆరవ రంగం

ఉలూగ్ ఖాను—ముస్తఫా

ఉలూంగ్—అరె! ఈ ఓర్గల్ ఫౌజ్కు హెంతపౌరుషం. హెంతజరఫ్ - పారిపోతాఉంటే హెంటబడి ఖతం నేస్తు

ఉన్నార్ - నాకీ ఢిల్లీకి పోతానో నైతో - హిక్కడ సచ్చిపో తానో తెల్వకుండా ఉంది.

ముస్తఫా—హిక్కడ ఆగితే మనం సచ్చిపోతాంసర్కార్ దాడ్ తీయవాలె సర్కార్—

ఉలూగ్—హారె ఎంతఖష్టం వచ్చింది! ఖ్వాజాహోజా ఖాన్ రాజాకి పట్టింది లేదూ మన్కి ఖబర్ తెల్వలేదు.

ముస్తఫా—హోళ్లు హక్కడ చచ్చిపోయి ఉంటార్ నాకి తోస్తది.

ఉలూగ్—ముస్తాఫాఖాన్ - హేమిసెయ్యాలె. లడా య్ సేసి...

ముస్తఫా—నాకీమాట హినో్క సర్కార్ - పారి పోదాం. మనఫౌజుఅంతా సచ్చిపోతాం. ఓర్గల్ వారికి ఇంత హిమ్మత్ ఉందీ నాకు తెల్వాదూ సర్కార్—

ఉలూగ్—అరె. ఏమిపౌరుషం తెల్గుబిడ్డకు తెల్గుబిడ్డ అచ్ఛా హిమ్మత్ గల బిడ్డ ఏమిలడాయ్ చేస్తార్—ఒక్క ఒకడు ఒకసింహంలాగ తోస్తది నాకు.

ముస్తఫా—పారిపోదాం సర్కార్-జల్దిపోవాలె.

ఉలూగ్—అరె. హెంత కష్టం వచ్చింది తెన్గుకత్తి ఇంతవాడి అని నాకు తెల్వదు. అల్లా హేమిసేయవాలె. పారి పోవాలె. ఖర్మం!

— —

ఏడవ రంగం

ప్రతీ—నాగయగన్నయమంత్రివారికి జయము. మహామంత్రులు బెండపూడి అన్నయామాత్యులంగారు వచ్చుచున్నారు—ఆంధ్రరాజ్యస్థాపక - కాలాగ్నిహోత్ర-జయము జయము.

అన్నయ—నాయనా నాగయగన్నయ మంత్రీ ఏమైనది మహారాజుసంగతి ఏమైన తెలిసినదా ?

నాగయ—ఇంకను తెలియలేదు ప్రభూ !

అన్నయ—నాయనా నాకేమియును తోచుటలేదు. నేను నారాజును కలిసికొనవలయును. నాహృదయము ఆరాటపడుచున్నది. నారాజును చూడకుండ నేనొకక్షణమైనను బ్రతుకలేను. గుఱ్ఱములు సిద్ధముగనున్నవా ?

ప్రతీహారి—శ్రీహిత నయశీలసిత
వాణీహిత మృదువచన ధారుణీ
హిత గుణసందోహా
త్రివిక్రమ విక్రమ సాహస నగధైర్యసార
సాహిణీ మారా
జయము జయము.
మందరగిరి సమధీరుడు
చండ భుజ బలుండు
కలియుగ భీముండు
కన్నమనీడు
జయము జయము

అన్నయ—నాయనా, నాగయగన్నమంత్రీ, మహా సేనానులు వచ్చుచున్నారు. ఎదురేగుదము. (ఆతురతతో) నాయనా కన్నమనీడూ, నాయనా సాహిణీమారరాజునకు క్షేమమా ? (భయంతో) - ఏమి నాయనా తలవంచెదరు? మహారాజున కేమైన ఆపదవాటిల్లలేదుగద !

సాహిణి—(గద్గదస్వరం) తురకలను ... పారద్రోలినాము కాని... రాజును రక్షించలేక పోయినాము తండ్రీ! మహారాజును రక్షింపలేని ఈ బాహువులను ముక్కలుచేయింపుడు ప్రభూ ! (దుఃఖం)

అన్నయ—(దుఃఖంతో) రాజును రక్షించలేదా ? రాజు ఏమైనట్లు ? ఇప్పటి కేమైన ఆశయున్నదా ?

సాహిణి—ఆశయుండిన మేమిట్లు వత్తుమా తండ్రీ! ఇంతకు రెండు రోజులకు పూర్వమే రాజును బందీగా ఢిల్లీకి గొంపోయినారు ?

అన్నయ—(పెద్దగా) రెండురోజులకు పూర్వమా ? అట్లయిన ఆవార్త మాకేల తెలియలేదూ ?

సాహిణి—రాజుతోనున్న సైన్యములను తురుష్కులు చుట్టుముట్టి ఒక్కరినైనను మిగులనీయక హతమార్చినారు. రాజును గొంపోయిన సంగతి చెప్పుటకు ఒక్కడు కూడ బ్రతికి బైటపడలేదు. వెదుకగా వెదుకగా మహారాజుగారి అంగరక్షకులలో ఒకడు కొనయూపిరితో అరణ్య

మధ్యమున పడియుండుట చూచితిమి. అతడు ఈ వార్తను చెప్పి ప్రాణములను వదలినాడు ప్రభూ.

అన్నయ—(ఏడ్పుతో) సర్వనాశనము. శివ! శివా! కాకతి సామ్రాజ్యమునకు నేటితో నూరేండ్లు నిండినవి. ప్రతాపరుద్ర కటాక్ష వీక్షా పేక్షచే నే నింత వరకును, ప్రాణములను బిగబట్టి యుంచినాను. ఇక సెలువజాలను.... (కన్నీళ్ళతో) కాకతి రాజ్యలక్ష్మి... సెలవు

నాగయ—(ఏడ్పుతో) తండ్రీ! ఈ నగర రక్షణ భారమంతయు నాపై పెట్టిపోయినావా? తండ్రీ! ఈ భారము నేను వహింపగలనా?

దూరాన కోలాహలము

ప్రతీహారి—నాగయా గన్న మంత్రులకు జయము ఢిల్లీనుండి క్రొత్త సైన్యములు వచ్చినవి. పారిపోవుచున్న సైన్యములు ఢిల్లీ సైన్యముతో కలసి తిరిగి ఓరుగల్లు వైపునకు మరలినవి. ఉలూగ్ ఖాన్ సైన్యములను నడిపించుకొని వచ్చుచున్నాడు.

నాగయ ఇక నగరముపై బడుదురు. ప్రజలను కాపాడుటకు తుదిప్రయత్నము సేయవలయును. ఓయీ...నగర ద్వారములను బంధించి వైచి తూర్పు ద్వారమున స్త్రీలును వృద్ధులును, పిల్లలును సమీప గ్రామముల తలదాచుకొనుటకై పారిపోవునట్లు చేయవలసినదని మనసేనానులకు నా యాజ్ఞ నందజేయుము.

---

ఏనిమిదవ రంగం

నాగయ—సేనానీ...ఇక మనకు ఆశలేనట్లే తోచుచున్నది.

సేనాని—నాగయ గన్న మంత్రులకు నమస్కరించి నేనొక విన్నపము సేయుచున్నాను. ఇక తురుష్క సేనను ఆపుట కష్టము. యుద్ధము సాగిన కొలది ప్రాణము లైనను దక్కను.

వార్తాహరుడు—మహామంత్రులకు జయము. ముప్పిడి నాయనంగారును, వెంకనాయనింగారును కొమ్మ నాయనింగారును, ఇంకను మరికొందరు సేనానులును, నగర ద్వారముల కడ ప్రాణము లర్పించినారు ప్రభూ.

సేనాని—యుద్ధమును ఆపి తురుష్కులకు లొంగి పొండని ఆజ్ఞ ఇచ్చుటవలన కొంత జనష్టము తగ్గును ప్రభూ.

నాగయ—తెలుగు సేనలు, తురుష్కులకు లొంగుట ఎప్పటికిని జరుగదు. పోని యుద్ధమునందు ప్రాణములర్పింతురు. అంతేకాని కత్తి క్రింద బెట్టి నమస్కరించుట నా ప్రాణము లున్నంతవరకు జరుగదు.

వార్తాహరుడు—ప్రభూ! ఆర్య వాటిక తురుష్కుల వశమైనది. మేదర వాడలోకూడ ప్రవేసించినారు. సిద్ధయ గారు వీర స్వర్గము నొందినారు. (ఏడ్పుగొంతుకతో) స్వయంభూ దేవాలయము, భైరవుని ఆలయము నాశనమైనవి. మన సైనికులు పీనుగ కుప్పలు—(దుఃఖముతో చెప్పలేక పోవును)

నాగయ—యుద్ధము అపుడని ఆజ్ఞ ఇయ్యనవసరము లేదు. హిందూ సైనికులందరును మడసిరి. ఇక మనము మాత్రము ఉన్నాము, రండి. ప్రాణములున్నంత వరకు పోరి మరణింతము రండు.

హర హర మహాదేవ
హర హర మహాదేవ

సైనికు లందరును ఒక్కసారి హర హర మహాదేవ-అనినట్లు వినిపించును. దూరమున అందరును యుద్ధమున మరణించినట్లు సూచన.

ప్రతీహారి.—

Sing song tone లో ఈమాటలు వినిపిస్తవి. The following words must be uttered in a surious sing song Tone in a manner befitting the occasion accompanied by low soft music.

చాళుక్య రాజుకు ఆరవ విక్రమార్కునికి
సామంతుడును
మండలేశ్వరుడును
అయిన కాకతి బేతిరాజు
స్థాపించిన రాజ్యమునకు,
నూరేండ్లు నిండినవి.
పటుతర బాహు విక్రమ ప్రతిభచే
పశ్చిమ చాళుక్య సేనానుల పరాభవించి
ప్రాభవమున నిర్మించిన త్రిలింగ సామ్రాజ్యము
నేడుకూలినది

బసవేశ్వరునికి పాల్కురికి సోమనాథునికిని
గురుండైన మల్లికార్జున పండితారాధ్యుడు
బోధించిన వీరశైవముచేత
బలమునుపొందిన
సైనికుల బాహువిక్రమము
నేటితో సరి.

* * *

పశ్చిమచాళుక్యులను రూపుమాపి
విజృంభించిన యాదవరాజులతో పోరాడి
వారివద్దనుండి అమూల్యరత్నరాసులను కైకొన్న
కాకతి రుద్రదేవునినాటి
శౌర్యాగ్ని చల్లారినది.

* * *

యాదవ భూపతులు
కాకతి రాజ్యలక్ష్మి
చరణద్వయముపై బడి
వేడికొనిన నాటి
ప్రతాపము మాసిపోయినది.

* * *

ఘూర్జరులను చితుకకొట్టి
లంపాకులను పణకించి
కాంభోజులను ఈడ్చి

కర్ణాటకులను కంపింపజేసి
సేవణులను చీల్చి
గౌడులను పీడించి
కళింగులను కాల్దన్ని
కేరళులను పరాభవించిన నాటి
ఆంధ్ర సైనికుల శౌర్యము అదృశ్యమైనది.
విద్యానాథ కవిచే కీర్తింపబడిన
అసహ్య ఘన శూర
రాయ మాన మర్దనుడు
ఉద్దండ మండలాగ్ర ప్రచండ నెలవీడుగండడు
మూరు రాయర గండ ముల్లోకవీరుడు
కాకతి వీర రుద్రుడు
ప్రతాపరుద్రుడు
తురుష్కులచే
బందీగా
కొనిపో బడినాడు.

* * *

కాకతి సామ్రాజ్యమునకు
ఆంధ్రసామ్రాజ్యమునకు
పద్మనాయక సామ్రాజ్యమునకు
శివశివా, నూరేండ్లు నిండినవి.

# మాటల దొంగ

ముసలమ్మ— గుంటూరు జిల్లా మనిషి వయస్సు 55 మితభాషి

దొంగ—

(పెద్ద మనిషి)— గుంటూరు జిల్లావాడే. యాసలేని తెలుగు మాట్లాడుతాడు.

కుఱ్ఱవాడు— అంతే

పోర్టరు— తెలుగువాడే.

ప్రయాణీకులు— అరవ తెనుగుమాట్లాడుతారు.

గార్డు— ఇంగ్లీషు తెనుగు మాట్లాడుతాడు.

రెండో—

ముసలమ్మ— అరవ తెనుగు.

పోలీసు— అరవ తెనుగు.

స్థలం—మద్రాసు, రైలుస్టేషను, ప్లాట్‌ఫారం.

ప్రవేశము ముసలమ్మ, పోర్టరు

ముసలమ్మ—అబ్బాయ్, రైలులో ఎక్కించరాదమ్మా అక్కడే కూర్చుంటాను.

పోర్టరు—కలకత్తా మెయిల్ ఇంకా రాలేదండీ. ఇంకో అరగంటకుగాని రాదు. ఇక్కడికే వస్తుందండి అమ్మగారూ, అందాకా ఈడనే కూకోండి.

ముసలమ్మ—ఇక్కడికే వస్తుందా?

పోర్టరు—మీరు కూచున్న కాడికే వస్తుందండి.

ముసలమ్మ—మరేం భయం లేదుగా నాయనా?

పోర్టరు—భయం ఏటండీ అమ్మగారూ, మరేంభయం లేదండీ. జనం కిటకిటలాడుతుంటారు. ఇక్కడేం భయంలేదండి.

ముసలమ్మ—మళ్ళీ వచ్చి బండిఎక్కిస్తావా? నాకు ఏబండి ఎక్కాలో తెలియదు నాయనా.

పోర్టరు—నేను వత్తాను గదండీ అమ్మగారూ.

ముసలమ్మ—తప్పకుండా వస్తావా ?

పోర్టరు—ఎందుకు రానండీ అమ్మా? మీకోసంవత్తానాఏటండి. నాకూలి మీకాడే ఉంది గాదండి!

ముసలమ్మ—రా నాయనా. వచ్చి నన్ను రైలు ఎక్కించు నీకు పుణ్యం ఉంటుంది.

పోర్టరు—ఇక్కడే కూకోండి అమ్మగారూ, టైము కాంగానే వత్తాలెండి.

ముసలమ్మ

పోలీసు—ఎక్కడికి పూడుస్తావమ్మా ?

ముసలమ్మ—గుంటూరు నాయనా. మాది గుంటూరుదగ్గర.

పోలీసు—దార్లో కూకుండా వేమమ్మా? అట్లా దూరంగా కూకో అమ్మా.

ముసలమ్మ—అట్లాగే నాయనా. ఇక్కడకూర్చోనా?

పోలీసు—కూకోండి

ప్రవేశము పదేళ్ళ కుర్రవాడు

కుర్రవాడు—అమ్మమ్మగారు మీరు ఏవూరు వెడ తారండి?

ముసలమ్మ—ఎందుకు నాయనా?

కుర్రవాడు—నేను నెల్లూరువైపుకు వెళ్ళాలండీ. ఒక్కణ్ణే వెడుతున్నాను ఎవరైనా తోడు దొరుకుతారేమో నని చూస్తున్నానండి!

ముసలమ్మ—నేనూ ఆవైపుకే వెడతాను అబ్బాయ్.

కుర్రవాడు—మీరు ఒక్కరే వెడుతున్నారా? ఎవరైనా వస్తున్నారా అండీ అమ్మమ్మగారు.

ముసలమ్మ—(అనుమానపడి) ఎందుకబ్బాయ్ ఆ సంగతి?

కుర్రవాడు—ఏం లేదండీ అమ్మమ్మగారూ, పెద్దవాళ్లు ఎవరైనా ఉంటే గార్డుతో మాట్లాడి మనకు కూర్చుంటానికి కాస్త స్థలం సంపాదిస్తారేమోనని. స్థలం దొరకటం చాలా కష్టమండి.

ముసలమ్మ—ఎట్లాగ నాయనా. అయితే అదొక చావు వుందీ!

కుర్ర—మీవాళ్లు ఎవరూ రైలు ఎక్కించటానికి రాలేదండి అమ్మమ్మగారూ?

ముసలమ్మ—రాలేదు నాయనా. మా అబ్బాయికి తీరిక లేకపోయింది.

కుఱ్ఱవాడు—అల్లా అయితే స్థలం దొరకటం చాలా కష్టం! టిక్కెట్టు కొన్నారాండి.

ముసలమ్మ—ఆ...ఏంనాయనా దిగులుగాఉన్నావేం?

కుఱ్ఱ—నేను ఒక్కణ్ణే బెజవాడ పోవాలె ఎట్లాగా అని దిగులుగా ఉందండి అమ్మమ్మగారూ.

ముసలమ్మ—అట్లాగా ఇంతచిన్నవాడివే నీవు. నిన్ను ఒకణ్ణే పంపారేం నాయనా మీవాళ్లు! ఫరవాలేదులే. నేను న్నానుగా. నాతోరా అబ్బాయ్.

కుఱ్ఱ—నేను ఒకవేళ నిద్రపోతే నన్ను కాస్తలేపి తెనాలిలో దింపండి అమ్మమ్మగారూ ?

ముసలమ్మ—బెజవాడ వెళ్ళాలంటివి.

కుఱ్ఱ—తెనాలిలోనే దిగుతాను.

ముసలమ్మ—కూర్చో అబ్బాయ్ కూర్చో. భోజనం చేసి వచ్చావా !

కుఱ్ఱ—ఆఁ అన్నంతినే వచ్చానండి. మీరండీ అమ్మమ్మగారూ. మీరు తిన్నారా ?

ముసలమ్మ—నేను ఇంత పెందలాడే అన్నం తింటానా? తినను నాయనా.

కుఱ్ఱ—మరి ఆకలైతే ఎట్లాగండి అమ్మమ్మగారూ ?

ముసలమ్మ—(నవ్వి)పండోఫలమోతింటా నాయనా.

కుఱ్ఱ—అయితే, అమ్మమ్మగారూ, రాత్రి ఫలహారానికి పండ్లు ఏమైనా తెచ్చుకొన్నారా ?

ముసలమ్మ—లేదు నాయనా. ఎక్కడన్నా కొను క్కోకూడదూ ?

కుర్ర—ఏ లుండదండీ అమ్మమ్మ గారూ. ఎక్కడా పండ్లు దొరకవండీ.

ముసలమ్మ—ఇక్కడేమైనా దొరుకుతయ్ అబ్బాయ్

కుర్ర—ఇక్కడ పచ్చఅరటిపండ్లు దొరకుతవి !

ముసలమ్మ—అయితే ఒక పావలా పండ్లు కొంటే బాగుండునే. ఎక్కడ దొరుకుతైయ్ నాయనా.

కుర్ర—నేను తెచ్చిపెడతాను ఇల్లా ఇయ్యండిఅమ్మమ్మగారూ.

ముసలమ్మ—ఇదె అబ్బాయ్. దబ్బున వస్తావా ? చప్పన రా నాయనా బండి టైము కావచ్చింది !

(గంట కొడతారు ఫస్టుబెల్.)

అయ్యో; గంట కొట్టారే. ఈ కుర్రవాడు ఇంకా రాలేదు ! మూట మోయటానికి కూలివాడూ రాలేదు ! ఇదేం కర్మం !

ప్రయాణీకుడు—తొందరపడాల్సిన అవసరం లేదండీ ముసలమ్మగారూ. అది బొంబాయ్ మెయిల్‌కు గంట.

ముసలమ్మ—అట్లాగా నాయనా. నాకేం తెలుసూ ? భయపడ్డాను ! ఈ అబ్బాయ్ పండ్లు తెస్తానని వెళ్ళాడు ఇంకా రాలేదే.

ప్రయాణీకుడు—అదుగోనండి ముసలమ్మ గారూ మీ మనవడు వస్తున్నాడు !

ముసలమ్మ—పండ్లు తెచ్చావు నాయనా ఇల్లా ఇయ్యి ఇదేనా మన బండి.

కుర్రవాడు—కాదండి అమ్మమ్మగారు మన బండి వస్తుంది. ఇంకా కాసేపు కూర్చోవాలె. ఇక్కడే వుండండి. నేను వెళ్ళి టిక్కెట్లు కొని తెచ్చుకొంటాను.

ముసలమ్మ—నీవు ఇంకా టిక్కెట్లు కొనుక్కోనే లేదూ? వెళ్ళు అబ్బాయ్ కొనుక్కోని రా చప్పున.

కుర్రవాడు—ఇంకా చాలా టైము ఉందండీ. మీరు ఇక్కడే కూర్చోండి. నేను ఇక్కడున్నట్లు వస్తాను.

[2. వ సీను: ప్లాట్ ఫారం మీద మరొకమూల]

[ఒకమూల దొంగ నిలుచుని ఉంటాడు. మంచి దుస్తులు వేసుకొన్న పెద్దమనిషిలాగే ఉంటాడు. వయస్సు పాతికేళ్ళ కంటె ఎక్కువ ఉండవు. ఇందాకటి కుర్రవాడూ, ఈ దొంగ పెద్దమనిషీ మాటలాడుకుంటూ ఉంటారు.]

దొంగ—ఏంరా కనుక్కున్నావా ?

కుర్రవాడు—ఆఁ.

దొంగ—ఏ ఊరు వెడుతున్నది ఆ ముసలమ్మగారు ?

కుర్రవాడు—గుంటూరు

దొంగ—ఈఊరు ఎందుకొచ్చిందో, బంధుగులు ఎవరో ఆ సంగతులన్నీ తెలుసుకొన్నావా ?

కుర్రవాడు—ఆ ఆమెగారి కొడుక్కు ఈ ఊళ్ళో ఏదో కంపినీలో పనిట.

దొంగ—సరే. ఆ మూటలో యేమున్నయో కని పెట్టావా ?

కుర్రవాడు—ఓ.

దొంగ—ఓరి పిడుగా ! ఎట్లా కనిపెట్టావు ?

కుర్రవాడు—ముసలమ్మగారు అరటి పండు కోనా లన్నది. తెచ్చిఇచ్చాను. ఆమెగారు ఆ పండ్లు మూటలో పెట్టుకొన్నది అప్పుడు చూచాను ఆమూటలో ఏమున్నదీ.

దొంగ—అచ్ఛా .....మంచిపని చేశావు. అయితే మూటలో ఏ మున్నవి కొంచెము చెప్పు ? ఏమన్నా లాభించే వ్యవహారమేనా?

కుర్రవాడు—ఒకటోరకం. వ్యవహారానికేం నిక్షేపం లాంటి కేసు.

దొంగ—ఏమున్నయో చెపుదూ. ఏమన్నా కాష్.

కుర్రవాడు—అహా—కాష్ ఆమె బొడ్లోనే ఉంది.

దొంగ—మరి ?

కుర్రవాడు—మూటలో రెండు పట్టు చీరెలు, నాలుగు సాదా చీరెలు ఉన్నవి. ఇంకా రవికెలు ఏదో అల్లాంటివి ఉన్నయ్.

దొంగ—ఖరీదు గల చీరెలేనా ?

కుర్రవాడు—ఆ. ఎంత లేదన్నా వంద రూపాయలు ఖరీదు ఉంటయి

దొంగ—నేను ఆమెగారిని చూడటంతోనే అనుకొన్నాను. ఇది మంచి కేసు అని! సరే. నడు ఇంకా ఆలస్యం ఎందుకూ ?

కుర్రవాడు—అదిగో. అక్కడే కూర్చున్నది ముసలమ్మగారు. పాపం. నాకోసం చూస్తున్నది.

దొంగ—ఏం, వరస పెట్టి పిలిచావ్వా ?

కుర్రవాడు—అమ్మమ్మగారూ అన్నాను.

దొంగ—అయితే నీవు ఆమెగారి కూంతురు బిడ్డవన్నమాట. తెలిసిందా ?

కుర్ర—నువ్వూ-?

దొంగ—నేను కొడుకును అవుతాను. నీవు నన్ను మామయ్యా అని పిలవాలి. జ్ఞాపక ముంచుకో. చటుక్కున పేరు పెట్టి పిలిచేవు వెధవా ?

కుర్ర—అహా. అంతమాత్రం తెలియదా. ఇవ్వాళ్ళ బట్టే నీదగ్గరుండి. నడు మెయిల్ ప్లాట్‌ఫారం మీదికి వస్తున్నది.

[దొంగ పెద్దమనిషి సంతోషంతో ఈలవేస్తూ నడిచి పోతాడు కుర్రవాడితో.]

సీను నెం 3.

[స్థలము: మొదలు ముసలమ్మ గారు కూర్చున్న స్థలం ప్రవేశ. కుర్రవాడు-వాడి వెనకాల దొంగ పెద్దమనిషి]

ముసలమ్మ—ఏం నాయనా టికెట్ కొనుక్కున్నావా? నీ కోసమే చూస్తున్నా. రా నాయనా మెయిల్ వస్తున్నది.

కుర్ర—(పెద్దగా సంతోషంతో) అమ్మమ్మా మామయ్య వచ్చాడు ?

ముసలమ్మ—(ఆశ్చర్యంతో) ఏమిటీ, ఎవరూ ?

దొంగ—ఇక్కడ కూర్చున్నావుటమ్మా! నీకోసం స్టేషనంతా వెతుకుతున్నాను.

ముసలమ్మ—ఎవరూ ?

దొంగ— నీకు చూపు ఆని చావకపోతే గొంతు అయినా గుర్తు పట్టలేవుటే. నేనే, అమ్మా నేనే-నే

ముసలమ్మ— నేనే అంటే ?

దొంగ—నేనే-గాని ఇంటికి వెడదాం రా.

ముసలమ్మ—ఇంటికీ ? ఇంటికేమిటి ?

దొంగ—ఇంటికేమిటని అడుగుతావు ఏమిటమ్మా. రా, ఇక పోదాము రా. అయిన గోల చాల్లే !

కుర్ర—అమ్మమ్మా మామయ్య పాపంపిలుస్తున్నాడు!

ఒక ప్రయాణీకుడు—మీకు ముసలమ్మగారు ఏమౌ తుంది బాబూ ?

దొంగ—మా అమ్మగారేనండి.

ప్రయాణీకుడు—ఆ అబ్బాయి ఏమౌతాడు ?

దొంగ—నా మేనల్లుడేనండి. మా చెల్లెలు కొడుకు. అమ్మా ఏం చెపుతా !

ముసలమ్మ—నీ వెవరా ? నీ కెక్కడ అమ్మనురా ?

దొంగ—ఈ మాత్రానికే నీవు అమ్మవు కాకపోతావా ఏమిటి ? నీవు అమ్మవు కాకమానావు నేను కొడుకును కాకమానను. వెళ్ళదాం ముందు లే.

కుర్ర—రావే. అమ్మమ్మ వెళదాం రావే

ముసలమ్మ—నీవు ఎవర్రా నీకు అమ్మమ్మనా ? గాడిదా.

(ప్రయాణీకులలో ఒక ముసలమ్మ)

ఎందుకమ్మా అల్లాగ తిడతావ్ ? ఇందాకటినుంచి ఎంతో గారాబంగా నాయనా అని పిలిస్తివి.

దొంగ—ఆ. నామీద కోపంతో, అల్లా అంటుంది లెండి, మా అమ్మకు కోపం వస్తే, కొడుకైంది తెలియదు మనవడు అయింది తెలియదు.

ఆ రెండో ముసలమ్మ—అల్లాగనే ఉంది చూస్తే !

సాహెబు—ఆ ముసలమ్మగారు,...మీరు హమ్మ అయితే...ఈ గొడవంతా హేమిటి ? మహారాజ్.

దొంగ—ఏమీ లేదండీ సాహెబుగారూ ఇంటిదగ్గర కోడలుతో పోట్లాడి వచ్చిందండీ !

కుర్ర—మా అమ్మమ్మ ఏమన లేదూ. మా అత్తయ్యే తిట్టింది !

ప్రయాణీకుడు—అత్తా ... కోడలుదా. పోట్లాడుకొన్నారు. సరి. సరి.

య్యా కోపంవచ్చి నాలుగురోజులు ఏకూతురింటికో వెళ్ళినా మళ్ళీ కొడుకు దగ్గరకు రాకేం జేస్తాము!

ముసలమ్మ— వీడు ఎవరమ్మా? వీడు నాకేం కొడుకమ్మా!

దొంగ—ఏమండీ పిన్నిగారూ (ఆరెండో ముసలమ్మతో) కోడలేదో అన్నదని ఆకోపం అంతా నామీద చూపించి వీడు నాకేం కొడుకు అని అంటుంది మాఅమ్మ చూడండి. ఇదేమన్నా న్యాయంగా ఉందీ?

అది అయినా మాటతొందర మనిషి! కోపంలో నా ఇంటినుంచి వెళ్ళిపో అన్నమాట నిజమే. కాని దాని తరువాత ఏడుస్తూ కూర్చున్నది. అత్తగారిని తీసుకొస్తేగాని అన్నం తిన నని!

[ప్రయాణీకులు]

మొదటి—అల్లాగా అండి. బ్రతిమిలాడి తీసుకువెళ్ళు నాయనా.

రెండవ—వస్తుందిలే రాకేం జేస్తుంది.

సాహేబు—గడబిడ హెందుకు అమ్మా హెళ్ళు అమ్మా హెళ్ళు. కోడలమే ఖోపంవస్తే కొడుకు హేమి చేస్తాడు?

ముసలమ్మ—వీడు నాకెక్కడ కొడుకర్రా. అయ్యో కర్మమా?

దొంగ—ఎక్కడ కొడుకు నేమిటమ్మా, కన్నకొడుకును? రా వెళదాం రా.

ముసలమ్మ—ఓరి నీదుంప తెగ! చెయ్యి పట్టుకుంటా వేమిరా వదులు!

దొంగ—వదులుతాను రామరి. లే. ఎందుకూ ఆలస్యం!

కుర్ర—రావే అమ్మమ్మా. అత్తయ్య ఏడుస్తున్నదట.

[ప్రయాణీకులు]

పో అమ్మా. పాపం చిన్నబిడ్డ హడలి పోతున్నాడు,

దొంగ—ఏం? - లే- వస్తావా, రావా? ఒక్కమాట చెప్పు?

ముసలమ్మ—ఛాఛా. నీ దొంగ వేషాలు నాదగ్గర సాగవు. వెళ్ళు.

దొంగ—అయితే రావన్నమాట!

ముసలమ్మ—ఛా—పో.

దొంగ—సరే. ఎట్లా రాకుండా ఉంటావో చూస్తానుండు. ఒరే నాయనా మూట ఎత్తుకో.

ముసలమ్మ—అయ్యో అయ్యో. నామూట ఎత్తుకెళ్తున్నారు. ఇదెక్కడి అన్యాయం!

దొంగ—ఎత్తుకెళ్ళక! నీకు ఇచ్చి పో అమ్మా అంటానటమ్మా. ఎవరన్నా అల్లాగ అంటారా?

[ప్రయాణీకులు]

(1) కొడుకు పిలుస్తుంటే ఎందుకమ్మా అంతపట్టుదల.

(2) పాపం ఆ అబ్బాయి మట్టుకు ఏం జేస్తాడు! అటు భార్యనూ అనలేడు. ఇటు తల్లినీ అనలేడు. మధ్య నలిగి చస్తున్నాడు.

(3) హెందుకు అమ్మా అంత గడ్‌బడ్ చేస్తావ్ పో అమ్మా.

దొంగ—రా అమ్మా

ముసలమ్మ—వీడు నాకుకొడుకూ కాదు గోడగడ్డలూ కాదు. దొంగముండా కొడుకర్రా.

దొంగ—నే నేమీ ముండా కొడుకును కాదమ్మా! నీ మెళ్ళో మంగళసూత్రం పచ్చగా ఉన్నంతకాలం నేను ముత్తయిదవ కొడుకునే. ఇంతకూ వస్తావా రావా? చెప్పు.

ముసలమ్మ—నేను రావటం ఏమిట్రా నీదుంప తెగ!

దొంగ—సరే. రావన్నమాట! ఇంకెందుకూ! ఒరే అబ్బాయ్—నీవు ఈమూట తీసుకొని నడు. నేను అమ్మను తీసుకొని వస్తాను.

ముసలమ్మ—అయ్యో అయ్యో, మూట ఎత్తుకెడు తున్నాడు. ఇదెక్కడి అన్యాయం?

దొంగ—ఎక్కడికి వెడతాడమ్మా. నీవు ఊరికే కొంప మునిగి పోయినట్లు అరుస్తావు! ఇంటికెడతాడు. నీవు కూడా రా అమ్మా. ఎందుకు అల్లరి పెడతావు నన్ను!

ముసలమ్మ—ఛీ పో. ఇదేమిటి ? ఇల్లా చూస్తూ ఊరు కొంటారేం అంతా ?

దొంగ—అమ్మా, చూడు. చెప్తున్నాను ఒకమాట! వస్తే...మర్యాదగా...రా, ఎంత బ్రతిమిలాడినా ఒకటే పట్టుదలా ?

ముసలమ్మ—ఓరి నీదుంపతెగ ! ఇదేమిట్రా !

దొంగ—సరే, నీయిష్టం. నీవు కూతురు దగ్గరకే వెడతావో! ఎక్కడికి వెడతావో వెళ్ళు. బట్టలకు ఇబ్బంది పడుతావు! తరువాత నీ ఇష్టం!

నేనుకూడా వెళ్ళిపోతున్నాను !

వస్తేరా! నామాట విను !

అమ్మా నేను వెడుతున్నాను.

రా, నా వెనకాలె గా.

ముసలమ్మ—అయ్యో అయ్యో, ఇదెక్కడికొడుకు. అంతా చూస్తూ ఊరుకొంటారేం?

[ప్రయాణీకులు]

సాహేబు—ఎక్కడికి పోత్రాడమ్మా నిన్ను ఒదిలి. నీకి బెదిరిస్తూ ఉన్నాడు కొడుకు.

రెండవ—పోంగా, అమ్మా పోంగా.

(రైలువస్తుంది. అంతా ఎవరిదారిని వాళ్ళు వెళ్ళిపోవటానికి సిద్ధపడతారు)

ముసలమ్మ—ఇదెక్కడి అన్యాయం. కొడుకుట! కొడుకూ నోడగడ్డలూనూ!

పబ్లిక్‌గా మూట యెత్తుకొని పోతూ ఉంటే దొంగ ముండా కొడుకు అంతా చూస్తూ ఊరుకుంటారేం!

పోలీసులకైనా చెప్పాలె.

[ప్రయాణీకులు]

(1) ముసలమ్మ అసాధ్యురాలు!

(2) కొడుక్కమీాదా రిపోర్టు భలె! భలె!

(రైలు కూత కూస్తుంది. గార్డు ఈలవేస్తాడు. ముసలమ్మ పెట్టెలో ఎక్కాలా వద్దా అని ఆలోచిస్తూ నుంచుంటుంది)

గార్డు—(ఈలవేసి) ముసలమ్మగారూ, బండి యెక్కు అమ్మా, బండిపోతుంది.

ముసలమ్మ—ఏం యెక్కేది నాయనా. పట్టుచీరలూ అవీ ఉన్న మూట యెవరో దొంగ చూస్తూఉండగా యెత్తుకెళ్ళాడు.

గార్డు—మరి ఉండి పోతావా?

ముసలమ్మ—యెక్కుతా. నాయనా. మళ్ళీ ఆ వెధవ కనపడి ఇంటికి రమ్మని చేతుల గాజులూ అవీ ఒల్చుకోవచ్చు

గార్డు—(ఈల) రైలు వెళ్ళిపోతున్న శబ్దం.

ముసలమ్మ

(పెట్టెలోనుంచి తొంగిచూచి, ప్లాట్‌ఫారం చివరను దొంగను చూస్తుంది. కుర్రవాడు గాని మూటగాని కనపడ లేదు.)

అదుగో, అదుగో. మూట యెత్తుకెళ్ళిన దొంగవెధవ ఇక్కడే ఉన్నాడు! ఓరి నీదుంప తెగ! ఇక్కడే ఉన్నావట్రా! యెంతధైర్యంరా నీకు!

దొంగ.—(రైలు పోతుంటే అరుస్తాడు,) అమ్మా! వెడుతున్నావుగదూ. యెంత చెప్పినా వినకుండా సరే. వెళ్లు.

పోనీ. మళ్ళీ వారంరోజులలో రా అమ్మా తప్పకుండా రావేవ్ !

## పరిహాసికలు

### గన్నయ—ప్రభ

ప్రభ—ఈ కాపురం నేను చెయ్యలేను బాబూ ఎంత డబ్బు వచ్చినా తగలేస్తుంటిరి. ఎల్లాగ గడవటం ?

గన్నయ—అదే నేనూ ఆలోచిస్తున్నాను.

ప్ర—ఏమిటి ఇంకా మీరు ఆలోచించేది ? ఇంకా ఎక్కడైనా అప్పు పుడుతుందా ?

గ—ఎక్కడా పుట్టేట్టు లేదు. అయినా ఇవ్వాళకు ఏదో ఉందిగా తింటానికి రేపటి సంగతి ఆలోచిద్దాములే. (తలుపుకొట్టినశబ్దం) ఎవరో తలుపు కొడుతున్నారు చూడు ప్రభా.

ప్ర—అన్నయగారు వచ్చారండి !

అ—గన్నయ ఇంట్లో ఉన్నాడా ?

గ—ఉన్నాను ప్రభూ దయచేయండి ఇల్లాకూర్చోండి! అంహా...ఇల్లాగ. ఇల్లాగ దయచేయండి. ఏం ప్రభూ, ఇల్లా వచ్చారు ? మా గృహాన్ని పావనంచేశారు ?

ప్ర—ఊరికరారు మహాత్ములు !

అ—ఊరికే ఎందుకు వస్తాను. నీ పీకకు ఉరి త్రాడు తెచ్చాను.

గ—ఎవరి పీకకు మహాప్రభూ ప్రభ పీకకా ?

అ—లేదు నీ పీకకే !

గ—నా పీకకే !

ప్ర—ఎవరి పీకకైతేనేంగాని అక్కడనుంచి తేవాలా అన్నయ్యగారూ ? నేను ఇయ్యక పోయినానా బారెడుతాడు!

గ—ఎంత పెద్దది తెచ్చారో ! సుమారైంది ఓమోస్తరుది చాలు. నేను పొట్టివాణ్ణే గదండీ ?

అ—నీ హాస్య ప్రసంగాలు కట్టిపెట్టు. ఊళ్ళో అందరికీ బాకీ పడ్డావు తెలుసునా ?

గ—తమదాకా వచ్చిందీ ఆవిషయం !

అ—ఇంకా పైకి పోయింది !

గ—అమ్మో ఇంకా పైకే ! అమ్మో !

ప్ర—ఎంతపైకి మహాప్రభూ ?

అ—చాలాపైకి వాళ్ళంతా నిపైన వ్యాజ్యాలు తెచ్చారు. నిన్ను పట్టుకెళ్ళి ఈ రాత్రే చెరసాలలో పడెయ్యమని మండలాధిపతి ఆజ్ఞ ఇచ్చాడు.

గ—హాం—ఎంతటి వాడికి ఎంతగతి పట్టింది మహాప్రభూ !

అ—నీవు నాతో రావాలె.

ప్ర—తమతో రావటానికేం భయం భోజనం చేసి వస్తారు ప్రభూ.

గ—పోనీ అక్కడే భోజనం చేస్తాను.

అ—జైలుకూడు తిందువుగాని రా.

ప్ర—అమ్మో ఆకూడు తినలేరు ప్రభూ! భోజనంచేసి వస్తారు అంత అవసరమైతే! తమరు కాస్త దాహం పుచ్చుకోరూ!

అ—కాసిని మజ్జిగ ఉంటే ఇయ్యి ప్రభా!

గ—ప్రభా—మజ్జిగ తెస్తున్నావా?

ప్ర—ఆ

గ—ఓసి పిచ్చిమొద్దూ అమాత్యులవారికి మజ్జిగ ఇస్తావుటే. ద్రాక్షరసము తీసుకొచ్చి ఇయ్యి.

అ—ద్రాక్షరసమా! ఇటువంటి వాటికి డబ్బు తగలెయ్య బట్టే మీకు ఈ గతి పట్టింది.

గ—తమరు చెప్పింది పరమసత్యం. వద్దేమనకు ఇటువంటివి అంటే ప్రభ వినదు ప్రభూ!

అ—చాలా బాగుంది.

ప్ర—చిత్తం ఇంకా కొంచెం?

అ—సరేకాని మరి చెరసాలకు పంపు గన్నయను.

గ—ఈ పూటకు క్షమించండి ప్రభూ. రేపు సాయింత్రం లోపున ఇయ్యవలసిన డబ్బు అంతా అణా పైసలతో ఇచ్చేస్తాను.

ప్ర—ఇస్తారు అన్నయ్యగారూ,

అ—తప్పకుండా!

ప్ర—ఓ తప్పకుండా ఇస్తారు. నాదీ పూచీ.

అ—నీ ముఖంచూచి వదిలేస్తున్నాను—(మత్తులో)

ప్ర—(విష్పర్) మత్తుమందు కలిపి ఇచ్చాను. మరేం భయంలేదు మీరు ఊరుకోండి. నాముఖంచూడండి అన్నయ్యగారూ! ఆయన ముఖం చూడబోకండి.

అ—ఈ పూటకు నిన్ను క్షమించాను. తెలిసిందా గన్నయ్యా?

గ—తెలిసింది మహాప్రభూ.

అ—ఏమి తెలిసింది!

గ—(పెద్దగా చెవిలో) ఈ పూటకు నన్ను క్షమించారు.

అ—రేపు సొమ్ము కట్టకపోతే ఊరుకోను తెలిసిందా?

గ—తెలిసింది ప్రభూ—(పెద్దగా)

అ—ఏమి తెలిసింది?

గ—రేపు సొమ్ము కట్టకపోతే

ప్ర—ఊరుకోరు తమరు.

అ—నా ప్రతిజ్ఞ తెలుసా?

ప్ర—తెలుసు ప్రభూ.

గ—తెలియదుప్రభూ.

అ—విను.

విజయ భూపతి అడ్డమువచ్చి నిల్చినన్ వారిజ బాం
ధవు డపరి వారిధి గ్రుంకకమున్ను గన్నయ శి
రంబు వంచి ధరణీస్థలిబడ ద్రోయకున్న నా పేరు
అన్నయ యేనినద భీషణ శంఖము దేవదత్తమే!

గ—పడిపోయినాడా ?...(నవ్వు)—నన్ను తీసికెళ్ళి చెరసాలలో పడేద్దామనుకొన్నాడు—తగిన శాస్తి అయింది.

శాస్త్ర తగ్గి వీడిని తల దన్న గలిగినాను.
చేతనగువాడు కార్యము
కై తగ్గును వంగు గాక యుల్బండగునా
యేతము చడి దా వలగును
బాతాళము నీరు దెచ్చి బయలం జల్లున్.

ప్ర—పట్టు ఈ యన్ను తీసికెళ్ళి వీధిలో పారేద్దాం.

ప్ర—అల్లాకాక్కాదు రాజుగారింటికి చాకళ్ళు బండితో ఉతికిన గుడ్డలు తీసికెడు తున్నారు. బండి వాకిట్లో ఉంది. వాళ్ళు ఎక్కడికో వెళ్ళారు. వాళ్ళు వచ్చేలోపున, ఈ కళే బరాన్ని తీసికెళ్ళి ఆ బండిలో బట్టల క్రింద దూర్చేద్దాం—(నవ్వు)

గ—అల్లాగే చేద్దాం. దివాళంలోకి పోయేసరికి మెల కువ వస్తుంది. వాళ్ళంతా మహామంత్రిని చాకలి బండిలో గుడ్డ లతో రావటం చూచి చాలా స తో షిస్తారు.

గన్నయ్య ఇల్లు—భార్యా భర్తలు.

గ—ప్రభా—జయ్ ప్రభావతీ. మాట్లాడ వేమే కాంతామణీ—ప్రభావతీ ప్రభావతీ అంహా అబ్బమాట్లాడ దే!

కనులిచ్చి నన్ను ఈ తనుమధ్య సూచిన
తనువున కమృత సేచనము గాదె
చిరునవ్వు బెరయ ఈ చెలువ నాతోడ
బల్కినం జెవులకు రసాయనము గాదె

యెలమి ఈ మగువ నన్నలయింప దివిరిన
నెడద కానందంబు నిక్క కాదె.

ప్ర—చాలు చాలు ఇక ఆపండి.

గ—ఏం ? ఎందుకాపాలె ?

ప్ర—ఎందుకా ఇవ్వాళ ఏమి తిందామా అని కొంచెం ఆలోచించటానికి !

గ—ఇంకో వస్తువ ఏదైనా అమ్మేద్దాం.

ప్ర—నా బొంద అమ్మటానికి ఏమీలేదు. వెండి కంచాలు, గిన్నెలు, పట్టు పరుపులు, దిండ్లు సమస్తం అమ్మేస్తిరి. రాజుగారు ఇచ్చింది అంతా ఒళ్ళూ పై తెలియకుండా పాడుచేస్తిరి. ఏవో అమ్ముకొని తిన్నన్నాళ్ళు తిన్నాము. ఇక అమ్మటానికి ఏమీ లేదు. మెళ్లో పుస్తెతప్ప !

గ—హా—హాత విధీ !

ప్ర—నా బొంద విధి చేతులారా తెచ్చుకొని ! మీరేమో మహా కవులు. నన్ను సుఖ పెడతారు అనుకొని మా వాళ్ళు నా గొంతు కోశారు.

గ—అహహా-నిన్ను నాగొంతుకు తగిలించారు-

ప్ర—ఎట్లా గయితేనేం ?

గ—చాలా భేదముంది గొంతుక కొయ్యటం వేరు. ఒక గొంతుకను ఇంకొక గొంతుకకు తగిలించటం వేరు. అయినా నేనేమీ తక్కువ కవిని గాదు. నా హాస్య ప్రసంగాలు విని మహారాజులంగారు పరవశులై పోయేవారు తెలుసునా ?

ప్ర—అయితే ఏంలాభం! మహారాజావారు ఇచ్చిన ధన మంతా భోగలాలసుడవై తగలేస్తిరి. ఇప్పుడైనా ఆయన దర్శనం చేసి ఏమైనా అడగండి. ఇవ్వాళ సాయంత్రం లోపున దండ నాథునికి డబ్బు కట్టాలని జ్ఞాపకం ఉందా?

గ—జ్ఞాపకం ఉంది. ఏమి చేసేది? మహారాజా వారికి నా మీద కోపం వచ్చిందామో! నా వలన ఆయనకు ఏమీ వినోదం కలగటం లేదట!

ప్ర—ఎందుకు అల్లాగ చేశారు?

గ—రోజూ ఏమి వినోదం కల్పించి చచ్చేది! నీవు మహారాణీ గారిని అడిగి ఏమైనా తీసుకొని రా రాదూ?

ప్ర—ఆమెకు నామీద కోపం వచ్చింది. రోజుకో క్రొత్తపాట పాడాలట! ఎక్కడనుంచి తెచ్చేది? అయినా మీరు కొత్తవి వ్రాసి ఇయ్యటం మానేస్తిరి.

గ—సరే! ఇప్పుడెట్లాగూ అంటా? ఈ పూటకు కూడా తండులములు...

ప్ర—(అందుకొని)—నిండు కొన్నవి.

గ—ఇప్పుడు మనం ఇద్దరం కూడా

ప్ర—ఇద్దరం కూడా?

గ—ఏదో ఒక అపూర్వమైన, అనూహ్య మైన కార్యము.

ప్ర—చెయ్యాలె.

గ—చెయ్యక పోతే—

ప్ర—అన్నం లేక మాడి చావాలె.

గ—మా-డి-చా-వా-లె (ఒక్కొక్క అక్షరము—విడిగా ఉచ్చరిస్తాడు)

ప్ర—(అదేమో స్వరు)—మా-డి-చావ-వ-లె-ను-

గ—సరి మంచిమాట చెప్పావే, ప్రభా అద్భుతమైన ఉపాయం చెప్పావు! మన కష్టాలు గట్టెక్కే ఉపాయం చెప్పావు కాబట్టి ఈ రోజున మనం ఇద్దరం————

ప్ర—ఇద్దరం??

గ—చద్దాము...

ప్ర—ఎట్లాగు చావటమూ?

గ—ఎట్లా గేమిటి? సుఖంగా.———పరు పేసుకొని—పడుకొని-ఆ పళంగా ఠాక్ మని చచ్చిపోదాం.

ప్ర—అబ్బ ఎంత సులభంగా చెప్పారండి మీరు చావండి నేను చావను.

గ—ఏం?

ప్ర—నాకు బతకాలని ఉంది. నేను చావను. మీరు చావండి.

గ—సరే నేను చస్తాను. నేను చస్తే నీకు మొగుడు ఎట్లా!

ప్ర—అక్కరలేదు.

గ—ప్రభావతీ—మొగుడు లేకుండా ఎట్లాజీవిస్తావే-ప్రభావతీ!

ప్ర—ఆ

గ—రత్నకలా, రాజహంసా, కలహంసప్రియా కాంచనమాలా కన్నాంబ

ప్ర—ఆ

గ—రాజరాజేశ్వరీ రాకేందు బింబాననా రాగసుధానిధీ—

ప్ర—ఆ.

గ—మందగమనా, కుందరనా, సుందరాంగీ నీలోత్పలా నీలలోచనా, కలకంఠీ– కమలలోచనా – కలభాషిణీ కనకాంగీ కాంతామణీ.

ప్ర—ఆ౹ ఆ౹ ఆ—దీనికేమైనా అంతుందా?

గ—(ఏడుస్తూ) నేను చనిపోయిన తరువాత నీకెట్లాగే? నిన్నెవరు చూస్తారు? నిన్నెవరు ప్రేమతో – ప్రభాప్రభా ప్రభావతీ, అని పిలుస్తారు! అయ్యో నీగతి ఏంగాను!

ప్ర—ఊరుకోండి – మీరు ఇంకాచావలేదు గదండి.

గ—అనుకొన్నాంగా ?

ప్ర—అనుకొన్నంత మాత్రానే చచ్చారా ఏమిటి?

గ—అయ్యో పిచ్చిదానా చేతిలో దమ్మిడిలేదు—ఉండు ఉండు పద్యంవస్తున్నది.

చేతన్ లేదు—

ననేనే—తో రే నననే— నేహె—నేనే—మొ॥

ప్ర—పద్యమువద్దూ బండలూవద్దు. చెపుదురూ

గ—ఏముందీ. వచనంలో చెపటానికేం? నిమిషంలో చెప్పేస్తా. చేతిలో దమ్మిడీ లేదా—ఊరినిండా అప్పులా? ఒక్క గింజ అయినా పుట్టదా! ఇవ్వాళ కాకపోతే రేపు అయినా చావాలిసిందే కదా!

ప్ర—ఆ!

గ—అందుకనె నేను ఏడుస్తున్నాను.

ప్ర—అయ్యో, అయ్యో, మీ తెలివి తెల్లవారి నట్లేఉంది. మీరు కాదు ఏడ్వాలిసింది - మీరు పోతే... నేనూ ఏడ్వవలసింది!

గ—అవునేవ్ - నా తెలివి తగలెయ్య - నీవుగదూ ఏడ్వాలిసింది... అవునవును... ఏడుమరి.

ప్ర—నేను ఏడవను.

గ—ఏడవవ్వూ?

ప్ర—ఉహూ.

గ—నీవు ఏడవవ్వన్నమాట. నేను చచ్చినా ఏడవవ్వన్న మాట! అంతేనా!

ప్ర—అంతే.

గ—అయితే అన్నిటికీ నేనే ఏడ్వాలన్నమాట—తిండిలేదని! నేను చచ్చినతరువాత ఏడ్వసిభార్య దొరిగిందే నని రెండందాలె ఏడ్వాలె. ఏడ్పుతప్పదు. అయ్యో - ప్రభా (ఏడుస్తాడు)

ప్ర—ఇదిగో మిమ్మల్నే—ఉండండి. ఇంకేమీ ఉపాయం లేదూ?

గ—ఏమీ లేదు. నీకేమైనా తోస్తున్నదా ?

ప్ర—నాకూ తోచటం లేదు. చావడమే !

గ—సరే - అన్నం లేక ఎట్లాగూ చావాలిసిఉంది—ఇవ్వాళో రేపో! కాబట్టి ఇప్పుడే చస్తాను.

ప్ర—చావండి. ఏం జేస్తాను. ఒకపద్దు ఏడ్చి మావాళ్ళఇంటికి వెళ్ళిపోతాను.

గ—ఓసి సుమంగళీ - ఆయుష్యంతురాలా! ఓసి ఓసి తెలివితక్కువ మొద్దూ, పాత్రం! బెల్లంకొట్టే రాయీ పచ్చడినూరే బండా—

ప్ర—ఆ—ఏమిటి చెప్పండి—

గ—మరిచిపోయినా, ఎందుకు తిడుతున్నాను. అసలు విషయం కాస్త జ్ఞాపకం చెయ్యి.

ప్ర—నేను ఇంటికి వెడతానంటే...!

గ—ఆ. ఆ, ఒసి, లేజవ్వనీ ఆకర్ణాంత విశాలనయనా-

ప్ర—మళ్ళీ తిడుతున్నారు-

గ—తిట్టకపోతే. చెప్పేవిషయానికి ఊపు రాదు—ఓ చెంచెలాక్షి, సుకుమార శరీర—సుందరాంగీ—

ప్ర—చెప్పండి.

గ—మళ్ళీ మర్చిపోయినా ఏం చెప్పొచ్చానో జ్ఞాపకం లేదు. కాస్త జ్ఞాపకం చెయ్యి.

ప్ర—ఉలభా నాకూ జ్ఞాపకం లేదు.

గ—అందుకనే నేను నిన్ను తెలివితక్కువ మొద్దూ అనేది. ముగవాడు తిడుతూఉంటే ఎందుకు తిడుతున్నాడో కాస్త జ్ఞాపకం ఉంచుకోవాలెనని తెలియకపోయె నీకు- సరే నాకే జ్ఞాపంవస్తుంది. ఓ - చూశావా నాకేజ్ఞాపకం వచ్చింది. చెపుతావిను. నేను చచ్చిపోవటంతోనే నీవు మహారాణీ దగ్గరకు పరుగెత్తికెళ్లి తల్లీ భర్తపోయినాడు అని ఏడు. జాలి పడి ఆమె ఏమైనా ఇస్తుంది. తెలిసిందా! దాంతో కొంత కాలం మనము హాయిగా బ్రతకొచ్చు.

ప్ర—మళ్ళీ మీరు చప్పునబ్రతకాలె లేకపోతే నాకు దిగులుగా ఉంటుంది.

గ—(చిటికలు వేస్తూ) - నీవు రాణిగారిచ్చిన డబ్బు తేవటంతోనే లేస్తాను.

ప్ర—సరే. అయితే దబ్బునచావండి.

గ—చస్తా చస్తా

ప్ర—ఇంకా ఏమిటి ఆలోచన ?

గ—ఏమీలేదే ఇంతబ్రతుకూ బ్రతికి దొంగచావు చావాసిలివచ్చిందేనని విచారంగాఉంది.

ప్ర—ఏచావుచచ్చినా ఒకగంటే కదండి. పోనీ అంత గా అయితే ఆతరువాత ఒకటోరకం దొరచావు చావకూ డదా ఏమిటి ?

గ—సరే. అయితే నేను ఈచాపమీదపడుకొంటాను పైన గుడ్డకప్పు.

ప్ర—నేను వెడుతున్నాను.

గ—ఛీ ! అల్లాగేనా వెళ్ళటము! ఓసి తెలివితక్కువ మొద్దూ, జుట్టువిరియబోసుకొని, పమిటజారవిడిచి ఏడుస్తూ, వెళ్లు.

ప్ర—సరే వెడుతున్నాను.

గ—(పెద్దగా) బాగా ఏడవ్వేం!

ప్ర—(దూరాన్నుంచి) - సరె సరె! - ఏడుస్తూ వెళ్ళటం వినిపిస్తుంది.

రాణి, సీత, దాసీ

నర్తకి—పాటపాడుతూ నృత్యంచేస్తున్నది.

సరళిత మురళీనినా మదియే. సందేహా మేల ?

మరల వినుము సఖీ మొ॥

మహారాణి—మురళీ కాదు - నీముఖం కాదు. అదేదో ఏడ్పులాగుంది.

నర్తకి—మరల వినుము సఖీ మొ॥

మహారాణి—అది ఏడ్పేనే సీతా.

సీత—అదుగో ప్రభావతి వస్తున్నది మహారాణీ, ఏడుస్తూ వస్తున్నదమ్మా.

ప్ర—అయ్యబాబో - తల్లీ - నాకొంపమునిగిపోయింది తల్లీ—(ఏడ్పు)

రాణి—ఏమిటి ప్రభా—

ప్ర—ఇంకేముంది తల్లీ! ఆయన హఠాత్తుగా పోయి నారమ్మా. నాకొంప కూలిపోయింది తల్లీ! ఇంకా ఎట్లా బ్రతికేది తల్లీ!

రాణి—అయ్యో! ఎంత అవస్థవచ్చింది పాపం!

సీత—ఇప్పుడే మహారాణీవారు నీమాట అనుకుంటున్నారు ప్రభా!

రాణి—పాపం - విధి అల్లాగ వ్రాసిపెట్టాడు కాబోలు!

ప్ర—(ఏడుస్తుంది)—ఇది విధివ్రాతే తల్లీ అయ్యో భర్తపోయి నేనెట్లా బ్రతికేది తల్లీ! అపరకర్మలకైనా అరకాసు లేదుతల్లీ! మహారాజులంగారిని తల్చుకొంటూ శ్రీవారి ఔదార్యాన్ని కీర్తిస్తూ ప్రాణాలువిడిచారు తల్లీ!

రాణి—ప్రభా - ఏంజేస్తావు. అనుభవించకతప్పదు. సీతా ప్రభావతికి ఈ నూరు వరహాలూఇయ్యి. ప్రస్తుత అవసరాలు జరుపుకొంటుంది. పో. ప్రభా. ప్రస్తుతం విషయం చూచుకో.

ప్ర—తల్లీ— నేను ఎట్లాబ్రతికేదితల్లీ! నేను ఇంకేమి బ్రతుకుతాను! నాప్రాణాలు పోతున్నాయి—

రాణి—పాపం, ఎంతలోకి వచ్చింది చావు. ఈవార్త వింటే మహారాజులంగారు ఎంతగా విచారపడతారో - సీతా మహారాణి రాజదర్శనం చేయాలని కోరుతూఉన్నట్లు తెలియజెయ్యి - మనోరమా మనం వెడదాం రా.

ప్రభావతి — గన్నయ

ప్ర—(నవ్వుతూ) ఏమండోయ్ లేవండి. నిద్రపట్టిందా.

గ—అమ్మయ్య బ్రతికాను—రాణిగారు ఏమిఇచ్చింది?

ప్ర—ఏమిఇచ్చినా మీకు దమ్మిడీ ఇయ్యను. కష్టపడి సంపాదించుకొన్నాను. చీరలూ అవీ కొనుక్కోవాలె.

గ—మనతిండికీ ?

ప్ర—మనతిండికి మీరు సంపాదించుకురండి.

గ—(కోపంగా)-అయితే నీవుచావు. నేనువెళ్ళి రాజుగారి దగ్గర ఏమైనా సంపాదించుకు వస్తాను.

ప్ర—అల్లాగే చెయ్యండి.

గ—అయితే నీవు పడకో చచ్చినట్లు గుడ్డకప్పనీ

ప్ర—ఇక వెళ్ళండి.

గ—వెడుతున్నా నాకోసం ఎవరైనావస్తే ?

ప్ర—చచ్చిపోయినారని చెపుతా!

గ—నీబొంద. నీవు చచ్చిఉన్నావుగా. ఎట్లామాట్లాడుతావు? నోరుమూసుకొని చచ్చినట్లుపడుండు తెలిసిందా?

ప్ర— తెలిసిందిగాని. మీరు బాగా ఏడ్వండి ఏడుస్తూనే పొండి.

మహారాజు—మహారాణి

రాజు—ఓహో రాణిసాహేబా వారా కులసాగా ఉన్నారా ?

రాణి—మహారాజావారు కులాసాగా ఉన్నారుగదా!

రాజు—కుశలమే మహారాణీ

రాణి—నేనూ కుశలమే మహారాజా!

రాజు—రాణిగారు దాసదాసీ జనంబులు క్షేమమేదా?

రాణి—క్షేమమే కాని, శ్రీవారి ఆశ్రితులలో.

రాజు—ఆఁ—ఆశ్రితులలో??

రాణి—మీ ఆశ్రితకోటిలో ప్రథముడైన గన్నయకవి మరణించిన వార్త ప్రభువులకు చెప్పుటకు విచారపడుతున్నాను.

రాజు—నే నతని ఒక గంట క్రిందనే చూశాను మహారాణీ పాప మతని భార్య ప్రభ మరణించింది.

రాణి—(నవ్వి)—అది కాదు ప్రభూ నేను ప్రభను ఓ గంట క్రింద చూశాను. పాపము ఆమె ఏడుస్తూ వచ్చింది? భర్త పోయినాడట.

రాజు—పోయినది ప్రభావతి కాదూ!

రాణి—కాదు ప్రభూ! గన్నయ చనిపోయినాడు.

రాజు—గన్నయను ఓగంట క్రింద నా కళ్ళతో నేను చూశాను. దేవీ!

రాణి—ప్రభావతిని ఓ గంటక్రింద నేను చూశాను. ప్రభూ!

రాజు—(నవ్వి) మహారాణీవారు పొరపడి ఉంటారు.

రాణి—(నవ్వి) మహారాజావారే పొరపడిఉంటారు.

రాజు—నవ్వులాట కాదు మహారాణీ ప్రభావతి చని పోయింది.

రాణి—కాదు, మహారాజా! గన్నయకవే పోయినాడు!

రాజు—అయితే ఈ విషయమై తగిన విచారణ జరుపుతాను. గన్నయ కవి చావలేదని నేను అంటాను. నిజంగా అతను చనిపోయినట్లయితే మీ ప్రభకు వేయి వరహాలిస్తాను.

రాణి—ప్రభ చావలేదని నేను అంటున్నాను. నిజంగా ఆమె పోయి ఉన్నట్లయితే మీ గన్నయ కవికి నేను వేయి వరహాలిస్తాను.

రాజు—అయితే ఇప్పుడే నేను నా మంత్రిని పంపి నిజస్థితి తెలుసుకొని రమ్మంటాను. సీతా రామయామాత్యుని రమ్మని చెప్పు.

సీత—చిత్తము మహాప్రభూ.

రాజు—దేవీ మన ఇద్దరికీ విచిత్రమైన వాదన వచ్చింది కదూ?

రాణి—అవును మహారాజా!

రాజు—ఇందులో నాకు జయం గలిగితే దేవిగారు గొప్ప బహుమతి ఇయ్యవలసి ఉంటుంది.

రాణి—(నవ్వి)—నా మాటే సత్యం అయి నాకే జయం కలిగితే దొరవారు ఏమి ఇస్తారో చూడవలసిఉంది.

సీత—రామయామాత్యులు వచ్చినారు.

రాజు—రామయామాత్యా! నీవు వెళ్ళి మన ఆస్థాన విదూషకుడు గన్నయ బ్రతికి ఉన్నది లేనిదీ తెలుసుకొని రావలయును.

రామయ—చిత్తం మహాప్రభూ!

రాణి—విదూషకుడు గన్నయ చచ్చిఉన్నది లేనిదీ చూడవలయును రామయామాత్యులు.

రామయ—చిత్తం మహారాణీ

రాణి—అమాత్యులు వెళ్ళారు.

రాజు—కనుక్కొని వస్తారు.

రాణి—కాని నిజానికి విదూషకుడు చనిపోయి ఉన్నా ఆమాట చెపటానికి అమాత్యులవారు భయపడతారేమో నని సందేహంగాఉంది ప్రభూ!

రాజు—(నవ్వి)—అట్లాగయితే రాణిగారు తమకు నమ్మకమైన వారిని పంపి నిజస్థితి తెలుసుకోవచ్చు నాకేమీ అభ్యంతరం లేదు.

రాణి—సీతా నీవు వెళ్ళి చచ్చిపోయింది విదూషకుడో అతనిభార్యో ప్రభో తెలుసుకొని ఇక్కడున్నట్లురావాలె.

సీత—చిత్తం మహారాణీ!

రాజు—వాళ్ళు వచ్చేలోపున కులాసాకు ఏర్పైన కార్యక్రమమును జరుపు మహారాణీ!

రాణి—నర్తకి నృత్యంచేస్తుంది ఆనందించండి మహాప్రభూ—

(నృత్యం—వినిపిస్తుంది)

— —

విదూషకుని ఇల్లు

గన్నయ—ప్రభా

గ—భలే తమాషా చేశావంగదూ ప్రభా నన్ను తగ లెయ్య భార్య పోయిందని ఏడ్చాను (నవ్వు) ఎట్లా ఏడ్చా ననుకొన్నావు ప్రభా—

ప్ర—మీరు భలే బాగా ఏడుస్తారండీ నిజంగా చూశారూ మీరు ఏడ్చినట్లు ఎవరూ ఏడ్వలేరు-నేను మటుకు నా శ్రాద్ధం పెట్టా! భర్తపోయినాడని ఏడ్చానండీ.

గ—పోనిలే కాసేపు ఏడిస్తివి వందవరహాలు కొట్టు కొస్తివి.

ప్ర—మీరు మటుకు ఎంత సేపు ఏడ్చారేమిటి?

గ—ఈ పద్ధతిమీద అయితే రోజూ ఒకసారి ఏడ్వ టానికి నాకేమీ అభ్యంతరం లేదు. అది సరేగాని చూడూ-రాణి ఏమను కొంటూ ఉంటుందీ?

ప్ర—మీరు చచ్చి పోయినారని!

గ—రాజు?

ప్ర—నేను పోయినానని!

గ—చివరకు వాళ్ళ ఇద్దరూ కలిస్తే—కలిసి మాట్లాడు కొంటే?

ప్ర—పోట్లాడు కొంటారు.

గ—ఎందుకూ?

ప్ర—మన ఇద్దరిలో చచ్చింది ఎవరైందీ తెలియక.

గ—చావనీ కొట్టుకు చావనీ లేకపోతే మనలను ఎంత వేధించారు డబ్బు ఇయ్యక!

ప్ర—ఏమండోయ్ మిమ్మలనే (పెద్దగా) అనుకొన్నంతపనీ అయింది చచ్చాం!

గ—చచ్చితి మీా యదమునను।

చచ్చెద మీాసాయంతనమున సాహస మొప్పన్

ప్ర—(ఆటంక పరచుచు) కొంపమునిగిందండీ రాణిగారి పెద్ద దాసీ వస్తున్నది!

గ—ఎందుకు చెప్మా!

ప్ర—ఎందుకేమిటి మీారు చచ్చిందీ లేనిదీ చూడటానికి!

గ—కొంపమునిగిందే! చేసిన మోసంఅంతా బైటపడుతుంది! ఏంజెయ్యాలె?

ప్ర—మీారు ఇంత తెలివితక్కువ మొద్దులేమండీ?

గ—అంతా బైటపడక తత్పదు ఏంజేస్తాం!

ప్ర—దబ్బున చావండి నేను ఏడుస్తూ ఉంటాను.

గ—చావాలిసిందేనా?

ప్ర—వస్తున్నది అది చప్పున పడుకోండి గుడ్డ కప్పుతాను.

గ—వచ్చినట్లుందే—ఏడ్పు మొదలు పెట్టు.

ప్ర—ఓరిబాబు ఓరినాయనా నా దేవుడో నాగతిఇట్లా కాలిందో బాబు! సీతక్కా వచ్చావా? నేను బ్రతకలేను సీతక్కా.

సీత—గన్నయకవిని మొన్న చూశానమ్మా. పాపం! ఎంతలోకి ముంచుకొచ్చింది—ఏమిటో కర్మ!

ప్ర—హఠాత్తుగా పోయినారు తల్లీ! దిక్కులేని దాన్ని అయిపోయినాను సీతక్కా.

సీత—మహారాణీవారు ఎంతో విచారించారు. ఊరుకో అమ్మా. ఏంజేస్తాం? నొసట వ్రాసిన వ్రాత తప్పించుకోలేముగదా! వెళ్ళి వస్తానమ్మా.

ప్ర—అయ్యో నాకర్మం ఇల్లాగ కాలింది సీతా! ఏంజేసేదమ్మా!

గ—వెళ్ళిందా ఆ దయ్యం! (విష్పర్)

ప్ర—అయ్యో సీతక్కా—(భర్తతో) ఒకటేతొందర చచ్చినోళ్ళు చచ్చినట్లుండక - ఇహా లేవచ్చు!

గ—గండంగడిచి పిండం బైటపడ్డది. (నవ్వు) ఇప్పటికిరెండుసార్లు బ్రతికాను. (నవ్వు)

ప్ర—దీనిదుంపతెగ. సరిగ్గా భోజనసమయానికి వచ్చింది. రండి తిండి తిందాము.

గ—(పెద్దగా భయంతో)-ఏమే, ప్రభా చచ్చాం. వీడిదుంపతెగ. రామయవస్తున్నాడు. చచ్చాం. రాజుగారు పంపిఉంటారు. ఇంకా చూస్తావేం! చావు తొందరగా!

ప్ర—నేను చావను.

గ—నీవు చావకపోతే ఎట్లాగే! నీవు చచ్చావని రాజుగారితో చెప్పానుగదా. ఆసంగతి నిజం తెలుసుకోనేందుకే రాజుగారు పంపిఉంటారు రామయను.

ప్ర—ఏమన్నా కానీ చావను. మీరుచావు మీరు చావండి.

గ—అయ్యో ఎట్లాగే - (శాంతంగా) అమ్మగదూ ఈ ఒక్కసారిచావు. మరిఒద్దులే.

ప్ర—ఊఏడ్వండి. చస్తున్నా.

గ—అయ్యో కాంతా, కమలలోచన, కనకాంగి

ప్ర—అయ్యో! అయ్యో! అదేం ఏడ్వటం?

గ—నీకు తెలియదు కవులము మేము ఏడ్చేపద్ధతి అదే—సుందరాంగీ సుగుణశీల - నన్నువదిలి వెళ్ళావా? గుణవతీ, కుసుమశరీరా. నీకు నూరేండ్లునిండినవా? (పెద్దగా) రామయమంత్రిగారు వచ్చారా. మంత్రిశేఖరా నాకర్మం ఇట్లాకాలింది. నా మోహనాంగి నన్ను మోసపుచ్చింది. నా జీవితసర్వస్వము నన్నువీడిపోయింది.

రామయ—గన్నయా నీవుకూడా ఇట్లాగ ఏడ్వవచ్చునా అన్ని తెలిసినవాడివి కర్మ అనుభవించక తీరదు. నీకు తెలియనిదేమున్నది? రాజుగారుకూడా విచారించారు ఊరుకో. మిగతా విషయాలు చూచుకో.

గ—బాబూ రాజుగారికి నమస్కారములని చెప్పండి నేనిక బ్రతకను. నా ప్రాణం ఈ మెతోనే పోయింది. ఉన్నది కట్టె.

రామయ్య—ఊరుకో గన్నయ్యా అయిపోయినదానికి ఏంజేస్తావు — నేను వెళ్ళివస్తా.

---

ప్రభ — గన్నయ

గ—ప్రభా ఇకమనం ఇక్కడుంటే మాటదక్కదు. ఎక్కడికైనా లేచిపోదాం.

ప్ర—ఎక్కడికి ?

గ—ఎక్కడికైనా రాజుగారి కళ్ళబడని చోటికి.

ప్ర—ఏమంత కర్మం?

గ—ఇంతఊహించలేవేమే. దాసిఏమో నేను చచ్చానని చెబుతుంది. మంత్రిఏమో నీవు పోయినావని చెబుతాడు అప్పుడు వాళ్ళకు అనుమానం కలుగదూ ?

ప్ర—తప్పకుండా కలుగుతుంది. ఏమిటా శబ్దం.

గ—బూరలు!

ప్ర—డోళ్ళు!

గ—చోప్దారుల కేకలు !

ప్ర—వందిమాగధుల సంకీర్తనాలు

గ—చచ్చామే ప్రభా. రాజుగారు స్వయంగా వస్తున్నారు.

ప్ర—(పెద్దగా)-చచ్చామండోయ్ రాణికూడా వస్తున్నది. మీరు తొందరగా చావండి. లేకపోతే నేను రాణిగారితో చెప్పిందంతా, అబద్ధం అవుతుంది. ఆమె నాతల తీయిస్తుంది.

గ—నీవుకూడా చావాలె. లేకపోతే నేను రాజుగారితో చెప్పిందంతా అబద్ధం అవుతుంది. అప్పుడు ఆయన నా తల తీయిస్తాడు.

గ—ఎట్లారా భగవంతుడా ?

ప్ర—ఎట్లా, భగవతీ.

గ—ముందు నీవు చావవే రాజుగారు వస్తున్నారు.

ప్ర—ముందు మీరు చావండి. రాణిగారు వస్తున్నారు.

గ—వినపడుతున్నవా ? (దూరాన వాద్యాలు)

ప్ర—వినపడకేం వినపడుతున్నవి

గ—చావుమరి ?

ప్ర—ముందు మీరు చావండి.

గ—నేనొకమాట చెబుతాను విను ప్రభా. నేను బ్రతికి ఉండాలంటే నీవు తత్‌క్షణం చావటం అవసరం.

ప్ర—నేనూ బ్రతికి ఉండాలంటే మీరు చావటం అంతే అవసరం.

గ—సరే ఇద్దరం చద్దాము.

ప్ర—ఇద్దరమూ చద్దాము సరే. ఆ వచ్చిన వాళ్ళకు ఇద్దరం చచ్చిపోయినామని తెలియుటం ఎట్లా ?—

గ—'ఇద్దరం చచ్చాము' అని ఒక కాయితం మీద వ్రాసి తలుపుకు అంటిద్దాము.

ప్ర—నేను పడుకొని చచ్చి పోతున్నా నండోయ్ వాళ్ళు దగ్గరిలోకి వచ్చిట్లున్నారు.

గ—నేనూ చచ్చాను—నన్నేం జేస్తారు వస్తేమటుకు ?

దూరాన నున్న కోలాహలం బూరాలు కొమ్ములు డోళ్ళు మొదలైన వాద్యాలు మరీదగ్గరకు వచ్చి ఆగిపోతవి·

మహారాజులంగారికి జై

మహారాణిగారికి జై

అని కేకలు.

సేవకులు—

1. లెండి, లెండి రాణీగారువస్తున్నారు !

2. లెండి, లెండి మహారాజులంగారు వస్తున్నారు.

మహారాజు—హా, హాత పధీ ! పాపం ఇద్దరూ పోయి నారు.

రాణి—నాకేం విజయం కలిగింది ముందు విదూషకుడే పోయినాడు. ఆ విచారంతో ప్రభ గుండెపగిలి చచ్చి పోయింది.

రాజు—అల్లాగ కాదు మహారాణీ ముందు ప్రభ పోయింది. నా స్నేహితుడు దుఃఖంతో గుండెపగిలిచనిపోయి నాడు.

రాణి—ఎప్పటికీ కాదు. ఆమె ముఖం చూడండి మహారాజా! ఇంకా ఆమె చెక్కిళ్ళపై కన్నీటి ధారలు చారలు కట్టే ఉన్నాయి.

రాజు—అతని కన్నులు ఎల్లాగ వాచి యున్నవో చూడు మహారాణీ. ఇప్పుడే కనుమూసి ఉంటాడు. ఒళ్ళు ఇంకా వెచ్చగానే ఉంది.

రాణి—వీరు ఏమన్నా అనండి. ముందు పోయింది విదూషకుడు.

రాజు—ముందు ప్రభే పోయింది మహారాణీ.

మంత్రి—ఇద్దరూ పోయినారు ప్రభూ!

వంది—నిజము, నిజము. దేవరవారు పలికింది నిజము.

రాజు—రామయ మంత్రీ, ముందు పోయింది ఎవరని ని అభిప్రాయం ?

మంత్రి—ప్రభే అయి ఉంటుంది మహాప్రభూ

రాణి—(కోపంతో)—ప్రభా !

మంత్రి—విదూషకుడే అయి ఉంటాడు తల్లీ!

రాజు—(పెద్దగా విసుగుతో)—ముందు ప్రభ పోయి ఉంటుందయ్యా

మంత్రి—చిత్తం చిత్తం

వంది—మహారాజులుం గారికి జయము జయము

రాణి—(పట్టుదలతో)—ముందు విదూషకుడు పోయినాడని చెపటం లేదూ !

వంది—రాణిగారికి జయము జయము

మంత్రి—మీ ఇద్దరిమాట నిజమే ఇద్దరూ పోయినారు.

రాజు—ముందు ఎవరు ?

రాణి—ముందు ఎవరు ?

మంత్రి—ముందా—మహారాజా— తల్లీ—ముందు ఇద్దరూ పోయి ఉంటారు—

(అందరూ నవ్వుతారు)

రాజు—ఈ విషయం తేలిందాకా నేను లేవను.

రాణి—నేనూ లేవను.

మంత్రి—ఎట్లా తేలుతుంది ప్రభూ ఇద్దరూ పోయినారాయె !

రాజు—ఎట్లాగయినా ఈ విషయం తేలాలి !

రాణి—అంతే.

మంత్రి—మహాప్రభూ—వాళ్ళిద్దరూ చచ్చిపోయినారు అంటే వారి ప్రాణాలు పోయినాయన్నమాట ! చచ్చినవాళ్లు చచ్చినవాళ్ళే కాని బ్రతికి మాట్లాడలేరు ప్రభూ!

వంది—నిజము నిజము.

మంత్రి—ప్రభూ ఈతడు అప్పులు జేసి చాలా కష్ట దశలో ఉన్నాడు-చచ్చిపోయినాడు కాబట్టి బ్రతికిపోయినాడు కాని బ్రతికున్నట్లయితే, అన్యాయంగా చచ్చేవాడు ప్రభూ.

వంది—నిజం ప్రభూ నిజం

రాజు—అయ్యో నా ఆస్థాన కవులలో ఒకరికి ఎంత ఇక్కట్టు వచ్చింది !

రాణి—అయ్యో నా చెలికత్తెలలో ఒకరికి ఎంత ఆపద వచ్చింది ?

రాజు—నేను ఒక మాట చెబుతాను వినండి.

వంది—అంతా వినండి. నిశ్శబ్దము

రా—(ఒక్కొక్క మాట విడిగా జాగ్రత్తగా ఉచ్ఛరిస్తూ) ఈ ఇద్దరిలో——ఎవరు——ముందు పోయిందీ—నాకు సకారణంగా చెప్పగలిగిన వాళ్ళకు—నేను వెయ్యివరహాలు ఇస్తాను.

రాణి—నిజమే ఈ చిక్కు విడతీసిన వాళ్ళకు నేను ఈ హారం ఇస్తాను.

వంది—బాగా ఆలోచించుకోండి. ఈ చిక్కు విడదీయగల వాళ్ళు ఎవరైనా ఉంటే ముందుకు రండి.

రాజు—ఎవరు ?

రామయ—నేను ప్రభూ. రామయమంత్రిని నేను చెప్పగలను. ప్రభ ముందు చనిపోయింది. నేను చూచినపుడు విదూషకుడు రాయిలాగ ఉన్నాడు—ఆ బహుమానం నాకు రావాలె మహాప్రభూ !

సీ—సీతవస్తున్నది మహారాజా !

రాజు—రాసీతా—ఏమిటి ?

సీత—రామయమంత్రి చెప్పింది అంతా అబద్ధం మహాప్రభూ – నేను నాకళ్ళతో చూశాను విదూషకుడు చనిపోయి పడిఉండటం ! అప్పుడు ప్రభ బ్రతికేఉంది ముందుపోయింది విదూషకుడు నాకురావాలె మహాప్రభూ ఆబహుమతి !

రాజు—ఎట్లా ఈచిక్కు ఎవరినీ ట నమ్మేది!

సీ—గన్నయ కదులుతున్నాడు ప్రభూ!

రాజు—ఆ విచిత్రం—చచ్చినవాడు బ్రతుకుతాడా!

సీ—అదిగో గన్నయ బ్రతికాడు—లేస్తున్నాడు

రాజు—ఏమిఈ విచిత్రం!

గన్నయ—మహాప్రభూ.

రాజు—ఏమిగన్నయా. మాట్లాడుతున్నావు కూడానా?

గన్నయ—అవును మహాప్రభూ. మాట్లాడాలిసిన అవసరం వచ్చింది కనుక మాట్లాడుతున్నాను. మాఇద్దరిలో ముందుపోయింది తెలియక మీారుచికాకు పడుతూఉంటే, తమసేవకుణ్ణి నేను ఎల్లాగ ఊరుకూడండగలను స్వామీ. ముందుచచ్చిపోయింది నేనేస్వామీ! వీళ్ళకు ఎవళ్ళకూ తెలియదు. ముందు నేనుచచ్చానుప్రభూ! ఆబహుమానం వెయ్యి వరహాలు నాకురావాలె.

వంది—విదూషకుడు బ్రతికేఉన్నాడు—(కేకలు)

గన్నయ—ముందుచచ్చింది నేనే ప్రభూ. ప్రభచావలేదు—

ప్రభ—నేనుచావలేదూ?— అబద్ధం మహాప్రభూ ఆయన చచ్చిన అరగంటకు నేనూచచ్చాను.

వంది—ప్రభకూడా బ్రతికేఉంది! (కేక)

రాజు—ప్రభా అయితే మీాలో ముందుచచ్చింది ఎవరు చెప్పూ?

ప్రభ—ఆయనే ముందు పోయినారు ఆతరువాత నేను పోయినాను.

రాజు—సరి—తేలిపోయింది ముందుపోయిందిగన్నయ్య వేయివరహాలు గన్నయకు ఇస్తున్నాను—

రాణి—చిక్కు విడిపోయింది. ప్రభా నిజంచెప్పి చిక్కు విడతీశావు. సంతోషించాను ఇందహారం.

వంది—అన్నయామాత్యులవారు వస్తున్నారు

అన్నయ—(కేకలు) గన్నయ, దుర్మార్గుడు మహాప్రభూ. పరమదుర్మార్గుడు! ద్రోహి! వంచకుడు.

రాజు—ఎందుచేత—మహామంత్రీ?—

అన్నయ—చాలా కథఉంది ప్రభూ ఈగన్నయ దుర్మార్గుడు—నాకు మత్తుమందు ఇచ్చి, చాకలివాళ్ళబండిలో పడేశాడు మహారాజా. చాకలిబట్టల మూటలో కుక్కారు అవమాన పరిచారు!

(అంతా నవ్వు)

రాజు—ఎందుకు వాళ్ళయింటికి వెళ్ళావు?.

అన్నయ—గన్నయ లోకులకు బాకీపడ్డాడు. వారందరూ దండనాధునితో చెప్పుకొన్నారు. దండనాధుడు గన్నయనుపట్టి చెఱసాలలో పడెయ్యమని ఆజ్ఞ ఇచ్చినాడు—అందుకై వెడితే ఇంతఅవమానం చేశాడు ప్రభూ

(నవ్వులు)

రాజు—అన్నయా—ఎందుకు అట్లాచేశారు?

గన్నయ—లోకులకు బాకీపడినమాట నిజమే కాని ఆలోకులను దండనాధుడి దగ్గరకు పంపింది ఈయనే.

ప్రభ—మనుష్యులను బాధించాలని మహారాజా అర్ధ రాత్రి వేళవచ్చి చెరసాలకురమ్మని కూర్చున్నారు ప్రభూ!

రాజు—అప్పుడు ఏమైందీ?

అన్నయ—నాకుమత్తుమందు ద్రాక్షరసంలో కలిపి ఇచ్చినారు ప్రభూ!

ప్రభ—అన్నయమంత్రిగారూ మీరు పొరపడ్డారు.

గన్నయ—అటువంటి దేమీ ఇయ్యలేదు.

అన్నయ— నేను ఒళ్ళు తెలియకుండా పడిపోలేదూ?

గన్నయ—పడిపోయినారు.

అన్నయ—ఎందుకు పడిపోతానూ?

ప్రభ—ఆవిషయం నేను చెపుతాను ప్రభూ.

ప్రభ—అర్ధరాత్రివేళ రమ్మన్నారు ప్రభూ— బాబూ రేపు సాయంత్రంలోపున బాకీలన్నీ తీర్చేసేస్తాము కాస్తగడు వియ్యండి·అని ఎంత బ్రతిమిలాడినా వినలేదు – అప్పుడేంచే సేది! భగవంతుడా రక్షించవలసినదని ప్రార్ధించాను ఆప ళంగా అన్నయగారికి.....

గన్నయ—మూర్ఛ వచ్చేసింది ప్రభూ!

ప్రభ—గన్నయఅంతటి సత్పురుషుణ్ణి కష్టాలపాలు చేస్తావా అని భగవంతుడికి కోపంవచ్చి ఆమూర్ఛ పంపిఉం టాడు ప్రభూ!

గన్నయ—అప్పుడు మేము ఇదేం కర్మంరా...

ప్రభ—ఎట్లారా భగవంతుడా!

గన్నయ—అని భయపడిపోయి,

ప్రభ—ఆయన్ను తీసికెళ్ళి వీధిలోఉన్న బండిలో పడుకో పెట్టాము.

గన్నయ—వాళ్ళు వైద్యశాలకు తీసికొనిపోతారనుకొన్నాము ప్రభూ!

రాజు—నిజమేనా అన్నయా?

అన్నయ—అంతా అబద్ధమే ప్రభూ!

రాజు—అబద్ధాలయినా చాలా తమాషాగా కల్పించారు—కానేపు నవ్వుకోవచ్చు. అన్నయా, గన్నయ నిను అవమానపరచినాడని అనుకోవద్దు. తమాషాకు చేసినపని అది. అన్నయా జీవితం కాళరాత్రిలాగ గంభీరంకాదు సుమా! మెరుపులు లాంటి చిన్నచిన్న వినోదాలు జీవితానికి ఆనందాన్ని ఇస్తాయని గ్రహించు. ఈ గన్నయను మనఃపూర్వకంగా క్షమించి దీవించు.

గన్నయా! అన్నయను అవమాన పరచినందులకు నిన్ను క్షమించాను—కాని దొంగ ఏడ్పులుఏడ్చి దొంగచావులు చచ్చినందుకుమాత్రం మిమ్ములను శిక్షించకమానను. ఎందుకు అల్లాంటిచావులు చచ్చారు? చెప్పు.

గ—క్షమించండి మహాప్రభూ మనిషి అయిన తరువాత ఎన్నిచావులుచావంది గడుస్తుంది మహాప్రభూ!

ప్రభ—ఎన్ని ఏడ్పులు ఏడవంది గడుస్తుంది మహా రాజా !

గ—మీకు వినోదం కల్పించటానికే ఈచావులు చచ్చాం మహాప్రభూ!

ప్ర—జీవితం అంటేనే కొన్ని చావులు మహారాణీ !

వంది—నిజం నిజం మహాసత్యం వెల్లడించారు విదూషకదంపతులు.

రాజు—సరే మీరు చెప్పింది విన్నాను. మీకు ఇచ్చే శిక్షఇది గన్నయ్యా. అబద్ధాలు ఆడటంలో నీకు ఉన్న ప్రజ్ఞ కవిత్వంలోకి పోనీ అక్కడ రాణిస్తుంది. ఇక మనుగడ గడవటానికి చావులు చావవలసిన అవసరం లేకుండా నేను చూస్తాను. ప్రతిసంవత్సరమూ ఇల్లాంటి దొంగనాటకం ఒకటి ఆడి మాకు ఆనందం కలుగజెయ్యి. ఇదే నీకు శిక్ష.

గ— }
ప్ర— } ధన్యులం మహాప్రభూ! ధన్యులం.

మంగళం.